# గృహలక్ష్మి

స్త్రీల సచిత్ర మాసపత్రిక

# GRIHALAKSHMI

LADIES' TELUGU MONTHLY



'GRIHALAKSHMI' GRIHA

సంపాదకుడు

డాక్టరు కె. యన్. కేసరి



సంపుటము ౨౦. మార్చి 1951 సంచిక 3.




### సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు.4-8-0. అర్ధసంవత్సరపు చందా రు.2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతిలేదు. విడికాపి ఆరు అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలాబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

### ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుటకీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువమైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

### వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమైయుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్రి ప్రచురణకు వీలగును. ఒకేప్రక్క సిరాతో స్పష్టముగ తప్పులులేక వ్రాయవలెను. భాష గ్రాంధికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వహక్కులు గలవు. ప్రకటింప నంగీకరింపబడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

### సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

### చిరునామా మార్పు

చిరునామాయందు మార్పుఉండుచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

### ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు,మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.




శోభనాచల వారి

# తిలోత్తమ

అంజలీదేవి... నాగేశ్వరరావు

సూర్యప్రభ నటించినది......

మహోజ్జ్వలముగా నిర్మించబడిన బ్రహ్మాండమైన జానపద చిత్రము...

డైరెక్టర్.... మీర్జాపురం రాజాసాహెబ్ వారు

N44

# విషయసూచిక





కేసరిగారు శ్రీమతి గిడుగు లక్ష్మీకాంతమ్మగారికి స్వర్ణకంకణము నొసంగుచున్నారు.




జయజయ గృహలక్ష్మీ సఖి! జయజయ లలితాంధ్ర మధుర సారస్వతమా!

జయజయ లలనా రత్నము! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!



# గృహలక్ష్మి స్వర్ణకంకణ ప్రదానోత్సవము

ఈసారి గృహలక్ష్మి స్వర్ణకంకణమును శ్రీమతి గిడుగు లక్ష్మీకాంతమ్మగారి కిచ్చుచున్నాము. వీలననగా ఆమె సంపూర్ణమగు ఆదర్శగృహలక్ష్మి.

ఆమె ఆంధ్రభాషావేత్త; కవయిత్రి; బహుకుటుంబిని; ఉత్తమగృహిణి.

ఆమె భర్తవద్దనే విద్య నేర్చినది; కవిత్వమల్లా నేర్చినది. భార్యకు చదువు చెప్పుట కష్టతరమని గాంధీమహాత్ముడే వ్రాసియున్నాడు. కావున ఈ విషయమున ఈమె అధికృత మెచ్చదగినది.

ఈమె కవిత్వము కేవల మూహాప్రపంచమున సంచరించునదికాదు. నిత్యజీవిత సమస్యలకే హెచ్చుగా సంబంధించినది. ఆమె తన పద్యకావ్యములందు ఉత్తమగృహిణి గృహకృత్యములనెట్లు మెళుకువగా నడుపుకోవలెనో, నడుపుకొనునో వానిని మిక్కిలిగా వివరించియున్నది.

ముఖ్యముగా నామె భర్త గ్రామాంతరంలో కార్యాంతరమున ఉండవలసివచ్చి నప్పుడు వారిరువురు వ్రాసుకొన్న పద్యలేఖలు, కాగల వియ్యపురాలితో కట్నము దూష్యమని హెచ్చరించుచు ఆమె జరిపిన వాదవివాదములు నాకు బాగుగా నచ్చినవి. వానిని గృహిణులంతా చదువదగును.

ఆమె బహుకుటుంబిని, ఏడ్గురు కుమార్తెలను, ముగ్గురు కుమారులను గన్న చల్లని తల్లి. నిరంతరము తన యింటికివచ్చిపోవు బంధుమిత్రవర్గము విశేషముగా కలయామె. అయినను ఇంతకాపురమును సర్దుకొనుచు భాషాసేవ, కవితాసృష్టి వదలక సాగించుచున్న విదుషీమణి యామె.

ఆమె భర్తఅండన సహధర్మచారిణియై, గృహనిర్వాహణమొనర్చుట ఒకవిశేషము గాదు; దురదృష్టవశమున ఆయన గతించగా, కడు క్లిష్టమైన ఆస్తి అయివజులతో, ఇతరమగు బ్రతుకు తెరువులను ఆశ్రయించి, ఇంటిపనుల మెళుకువతో నడుపుకొనుచు, తన పెద్దకుటుంబమును చాకచక్యముతో నిర్వహించుచున్న ఉత్తమురాలామె.

ఆమె బిడ్డలందరు విద్యావంతులు, విద్యార్థులు. చక్కని శిక్షణగల్గి, చురుకు, చొరవ, వివేకము, కళాకాంతులు కల్గినవారు. ఆమె కుమార్తె చి॥ భారతీదేవి కేసరి హైస్కూలులో సంగీతమున ప్రావీణ్యమునుచూపి శ్రీమతి బెంగుళూరి నాగరత్నమ్మగారి ప్రథమ స్వర్ణపతకమును పొందినది. ఆమె చిన్నబిడ్డలు పాములవాండ్రుగాను, ఇంక ఇతర వేషములతోను చాలయుత్సవములలో ముద్దుముద్దుగా ఆటపాటల వినోదముకల్పించుట మద్రాసులో తెలుగువారికందరికి యెరుకయే. ఇదంతయు ఆమె బిడ్డలకిచ్చు శిక్షాప్రభావము.

ప్రజాహితజీవితము నడుపు ఇతర నారీమణులకువలె ఆమెపేరు ప్రచారమున లేకున్నను గడపదాటని ఆదర్శప్రాయమగు గృహలక్ష్మియని ఈసారి స్వర్ణకంకణము నామెకు సంతోష పూర్వకముగ మీయందరిమోల అర్పించుచున్నాను.

ఈ సభకు శ్రీమతి అన్నాప్రగడ చన్నఘంటమ్మగారు నాకోరిక మన్నించి అధ్యక్షురాలుగా వచ్చియున్నారు. ఆమెయందు నాకుగల యొక ప్రత్యేకాభిమానమే ఆమె నీ పదవి నలంకరింప గోరుటకు ముఖ్యకారణము.

నా అభిమానకారణములను మీరు వినగోరుదురు. ఆమె, నావలెనే బాలబాలికా విద్యాభిమానియై వారికి విద్యాలయముల నెలకొల్పినవారు, ప్రత్యేకధనసహాయము చేసిన వారు, తమకుమార్తెకు యం. ఏ వరకు విద్యచెప్పించినవారు సైన రావు బహదూర్ కల్లి చిట్టిబ్బాయిగారి పుత్రిక.

ఆమె యెన్నో శ్రద్ధాభక్తులతో విద్య నేర్చి, విద్యార్థిగానే చాల మెప్పుపొంది, ఎన్నో బహుమానముల నందియున్నారు. మొదట విల్లింగ్డన్ కళాశాలలో ఉద్యోగమొనర్చియు, దానిని వదలి, నేడాంధ్రమహిళాసభలో రాణీ లక్ష్మీబాయి పారిశ్రామిక శాఖను పాలించుచు యువతులకు బ్రతుకుతెరువు నేర్పించుచున్నారు. అంతేగాక అనేక స్త్రీ జనాభ్యుదయ కార్యక్రమముల పాల్గొనుచున్నారు. ఆ యా కారణములచే నామె నభిమానించి ఆమె నీపదవి నలంకరింపగోరితిని.

పోయినసంవత్సరమున ఈయుత్సవమునాటికి నారుగ్మత తీవ్రముగానుండెను. రాగల సంవత్సర మేమౌనని ఈ కంకణప్రదానమునకు నాడే శాశ్వతమగు నేర్పాటును గావించితిని. ఆనాడు నన్ను జయప్రదముగా యుత్సవము జరుపుకొమ్మని ఆశీర్వదించిన శ్రీ భగవాన్ రమణమహర్షి నేడు లేరు. ఆయన ఆశీర్వచనబలిమిచే ఈ సంవత్సరమును ఈ ఉత్సవమును స్వయముగా చేసి చూడగల్గితిని. మీ ఆశీర్వచనమున, భగవంతునిదయవలన, నాకు ఆయువుతోపాటు ఆరోగ్యమును సమకూరినట్లైతే, నాఐశ్వర్యమునింకను ఉత్తమమార్గములలో యథాశక్తి వినియోగించి ప్రజాహిత కార్యములను సాగింప కుతూహలముగానున్నది.

2-3-51                                                                  కే. యన్. కేసరి.

---

"లేఖదూతలో" గి. వెం. రామమూర్తిగారి ప్రశ్న.



ఇంతటి శైలివ్రాయ దరశేషణ! నీ కెటులబ్బె? నారి! నా
కెంతయు నబ్బురంబాదవె ఇట్టి కవిత్వ విలాసవైఖరుల్
ఇంతటి శబ్దసౌష్ఠవము నింత మృదూక్తి విశేష భావముల్
కాంతరో! నీ కడన్ గనగ గర్వముజెందితి నమ్ము నెచ్చెలీ!

(6-11-34 లేఖ.)

---

గృహలక్ష్మి స్వర్ణకంకణ గృహీత

# శ్రీమతి గిడుగు లక్ష్మీకాంతమ్మగారి

## ఉపన్యాసము.

---

అధ్యక్షా మహాశయులారా, సోదర సోదరీమణులారా,

నేడు పెక్కు మహాశయుల సమక్షంలో, సాహిత్యాభిమాని, స్త్రీ జన పురోభిలాషి, గృహలక్ష్మి పత్రికాధిపతి, శ్రీ కేసరిగారు, ఈ గృహలక్ష్మి స్వర్ణకంకణము నాకు బహూకరించడం నిజంగా నాకొక పర్వదినం. ఆంధ్రదేశంలో శ్రీ కేసరిగారిని తెలియనివారు లేరు. మన తెలుగు వారిలో స్వయం కృషిచే తారాపథాన్ని అందుకొన్న బహు కొద్దిమందిలో కేసరిగారొకరు. స్త్రీ జనాభివృద్ధికి చేయు సారస్వత సేవలో డాక్టర్ కేసరిగారిది అగ్రస్థానం.

మహాశయుడు శ్రీ కేసరి స్త్రీ జనాయురారోగ్యాలకుగాను, చాలా కాలము ఎన్నో ఇక్కట్లుపడి "లోధ్ర" అనే దివ్యౌషధాన్ని కనుగొనగలిగారు. స్త్రీల సారస్వతాభివృద్ధికీ, సేవకు, గృహలక్ష్మి పత్రిక స్థాపించారు. మద్రాసులో మాతృభాషలో, సరియైన పాఠశాలలేక ఇబ్బందులు పడే తెలుగుపిల్లలకు ఒక ఉన్నత పాఠశాలను నిర్మించి తెలుగుభాషయందభిమానాన్ని, తెలుగు పిల్లలపై పితృప్రేమను చూపించారు. అట్టి మహాశయుడు, దాత, భాషాభిమాని, శ్రీ కేసరిగారిచే యీ సంవత్సరము నాకీ సన్మానము జరగడం, నాకొక గొప్పసుదినం. ఇందుకు శ్రీ కేసరిగారికి నేనెంతో కృతజ్ఞురాలను.

నేను ఆత్మవిమర్శన చేసుకొంటే, నాకున్న కవితాశక్తిని వృద్ధి పొందించుటకు ప్రోత్సాహానికై ఈ సన్మానము చేస్తున్నారని అనుకొంటున్నాను. దానికి నేనెంతో సంతోషిస్తున్నాను. నాకు వి హమైనది మొదలు, నాగురువు, వేదాంతి, మార్గదర్శకులునైన, నాభర్తగారు, నాకు కవితాశక్తిని కలిగించారు. కవిత్వాని నేర్పారు. నాకు తోడుగా కుడిభుజంగా ఉండి నాతోపాటు రచనాశక్తిని నేర్చుకొన్న నా ఆడబడుచు కీ॥ శే॥ జొన్నలగడ్డ శారదాంబతో కలిసి గ్రంథాలకు రచించ గలిగాను. ఆమెయే ఈ శుభదినానికి జీవించియుంటే ఆ నిష్కళంక హృదయం ఎంత సంతసించి యుండేదో! ప్రతీసాహితీ సభలోనూ ఆమె నెప్పుడూ తలచుకుంటూ యుంటాను. 1943 లో నాభర్తగారి మరణం నా జీవితంలో గొప్ప విషాద సంఘటన. తర్వాత కొద్దినెలలకే నా సహాధ్యాయిని నా శారద స్వర్గస్థురాలవటంతో నా హృదయంలోని గాయం మరీ పెద్దదయింది. అప్పటికింకా నా మగపిల్లలు రెక్కలురాని పసికూనలు. ఈ సంఘటనలతో, సామాన్యకుటుంబస్త్రీ అయిన నాకు నిరుత్సాహం, నా కవితాభివృద్ధికి ఆటంకం కలిగాయి. ఈ పరిస్థితుల్లో, నా స్నేహితురాండ్రయొక్కయు, ఆత్మీయుల యొక్కయు, నా పెద్దాడబడుచు ఆలమూరి రాజేశ్వరియొక్కయు ప్రోత్సాహంచేత మనసును ఎట్లో కుదుటపఱచుకొని, దివంగతులయిన నా భర్తగారికిన్ని, నా శారదకునూ, అతియిష్టమయిన భాషాసేవపై, కుటుంబ సమస్యల

నెదుర్కొంటూనే నా హృదయాన్ని మరల్చుకోగలిగాను. అప్పటినుండి నేను రచించిన పద్యాలను, వ్యాసాలను ప్రకటించి గృహలక్ష్మి పత్రిక నాకెంతో ప్రోత్సాహాన్ని, అవకాశాన్ని కల్గించింది. అదే యీ పత్రికతో నాకు పరిచయం. ఆ పరిచయం కల్గినందుకు నేనెంతో గర్విస్తున్నాను. ప్రతీసంవత్సరము జరిగే గృహలక్ష్మి జయంత్యుత్సవాల్లో పాల్గొంటున్నాను.

మన తెలుగుభాష, తమిళం, మళయాళం, కన్నడం, తులు భాషలలోపాటు, ద్రవిడభాషా కుటుంబంలో చేరిన భాషయే. కాని, ఆంధ్రసామ్రాజ్య మెక్కువగా, మన తెలుగు జిల్లాలయందు, అంటే కోస్తాజిల్లాలలోనూ, రాయలసీమలోను, గోల్కొండ, వరంగల్, ప్రదేశాల్లోనూ, వ్యాపించియుండటంచేత ఆంధ్రరాజులభాషయైన, ప్రాకృత భాషాపదజాలం మన తెలుగుభాషలోనికి ప్రవేశించింది. మన తెలుగు దేశంచుట్టూ ఇతరభాషలున్నాయి — ఓఢ్రం, హిందూస్తానీ, మహారాష్ట్రం, కన్నడం, తమిళం. ఈ భాషలాడు వారితోగల పరిచయంవల్ల ఈ భాషనుండి కూడ కొన్నిమాటలు మన తెలుగుభాషలోనికి వచ్చాయి. వీటన్నిటికన్నా ఎక్కువగా సంస్కృతభాషాపదాలు వేలకొలదిగా మన కావ్యాలలోనే కాక, నిత్యమూ వ్యవహరించుకొనే తెలుగుభాషలోకూడ వేలకొలదిగా వున్నాయి. ఈవిధంగా మన తెలుగుభాష నానాటికి వృద్ధిపొందుతూ వచ్చింది. భాషాసాంకర్యము కూడదంటూ ఇతరభాషలనుండి వచ్చిన పదాలను కావ్యాలలో వాడటానికి సంశయిస్తూ వుంటాం. వాడుకలోనుండి, భాషలో, పాలు, నీరుకలిసి పోయినట్లు, మిళితమయిన తర్వాత అవి ఇతర భాషలోని వన్నమాట మఱచి మన తెలుగుమాటలే అన్న నమ్మకంతో పద్యాలలోకి కూడా ఎక్కిస్తున్నాం. భాషాభివృద్ధికి ఈ సాంకర్యం పోషకమే కాని, ప్రతిబంధకంకాదు. ఆంగ్లభాష ఇట్టి సాంకర్యంవల్లనే అభివృద్ధిపొంది ప్రపంచభాషలలో అత్యున్నతస్థానం పొందింది.

మన తెలుగు వాఙ్మయం ఎప్పుడు ప్రారంభించిందో సరిగా గుర్తించి చెప్పలేము. మనకు తెలిసినంత వరకూ నన్నయ రచించిన, తెలుగు మహాభారతమే మన తెలుగువాఙ్మయచరిత్రలో మొదటిది. ఇతడు క్రీ॥శ॥ 1020 - 1030 నాటివాడు. రాజమహేంద్రవరంలో రాజరాజనరేంద్రుని ఆస్థానమందున్న మహాకవి. తనిరచన మిగుల ప్రౌఢంగాను రసవంతంగాను సొంపుగాను ఉండడంబట్టి చూస్తే, అతనికి పూర్వం తెలుగుపద్యరచన ఉండి ఉండాలని తోచకమానదు. అలాలేకపోతే ఒక్కసారిగా మొదటికవిరచన అంత చక్కగా సాగుట సంభవంకాదు. నన్నయకు పూర్వం తెలుగు కవిత్వం వెలసి నన్నయనాటికి ప్రౌఢతను పొందిందని మనమూహించి చెప్పడమే కాదు. అలా చెప్పడానికి శాసన ప్రమాణాలు కూడా ఇటీవల దొరికాయి.

నన్నయ మొదలు 1520 నాటి కృష్ణదేవరాయల వరకునూ గల మహాకవులు భారత, రామాయణ, భాగవతాది సంస్కృత పురాణములనే తెనిగించి తెలుగువాఙ్మయమును నిర్మించారు. కృష్ణదేవరాయల కాలంలో స్వతంత్రరచనలు బయలుదేరినా కథావస్తువు ప్రఖ్యాతమయిన పురాణమునుండిగాని, దేశచరిత్రలో ప్రఖ్యాతమయిన కథనాశ్రయించి ఉండాలనిన్నీ కవులకు విహితధర్మమయి ఉంది. శ్రీనాథుడు పురాణయుగంలోని వాడే అయినా, కాశీఖండము, భీమఖండం, శృంగారనైషధములతో పాటు స్వతంత్రగ్రంథంగా పల్నాటి వీరచరిత్రను, ద్విపద కావ్యంగా రచించాడు. పురాణయుగంలోని శైవకవులు జన

సామాన్యానికి సుబోధకంగా ఉండవలెనన్న ఉద్దేశ్యంతో ద్విపదకావ్యాలనే రచించారు. కృష్ణదేవ రాయలవంటి రాజులు ఆస్థానకవులను చేరదీసినప్పుడు రాజులమెప్పుకోసం పండితుల మెప్పుకోసం, కవులు క్లిష్టమయిన సంస్కృతసమాసాలతో శబ్దాడంబరంగల కావ్యాలు రచిస్తూ వచ్చారు. వర్ణన చమత్కృతిలో గూడ అనుకరణమే ఎక్కువగా చూపించారుగాని స్వతంత్రకల్పన అట్టే కనపడలేదు. అందుచేత 17 వ శతాబ్దంనుండి కవితాప్రశస్తి నీరసించింది.

19 వ శతాబ్దంనుండి తెలుగు వాఙ్మయం దృష్టిమారింది. నవీనసాహిత్యవీథులు బయలుదేరాయి. అందుకు కారణం బ్రిటిషువారి రాజ్యాధికారం. ఆంగ్లచదువులు, ఆంగ్లసారస్వత ప్రభావం, ఆంగ్ల సాహిత్యవీథులు, తెలుగురచయితలకు, నూతనోత్సాహం కలిగించాయి. ప్రాచీనరీతు లనుసరించుటవల్ల అనుకరణమే ఫలితముకాక తప్పదని తోచింది. ఈవిధంగా శ్లేషకవిత్వాలు ద్వ్యర్థిబంధకవిత్వాలు, త్ర్యర్థి కావ్యాలు, చిత్రకవిత్వాలు, శుద్ధాంధ్రకవిత్వాలు, నిర్వచన, నిరోష్ఠ్యకవిత్వాలు పుట్టాయి.

దేశమార్పులతోపాటు, సాహిత్యంకూడా పరిణామం చెందుతుంది. సాహిత్యంలో పాతపద్ధతులు పోయి నూతన దృక్పథాలు వస్తాయి.

మన సాహిత్యం జీవితానికి ప్రతిబింబంగానేకాక జీవితాన్ని మార్చే సాధనంగాకూడా ఉండాలనే విషయాన్ని మనం గుర్తించాలి. మన రచనలు జీవితానికి ప్రజాభివృద్ధికి ఉపకరించేటట్లుండాలి. ఇలా చేస్తేనే రచయితలు ప్రజలతోకలసి ముమ్ముందుకు నడుస్తారు. సాహిత్యానికి, ప్రజకి, సన్నిహిత సంబంధం, స్నేహం ఏర్పడుతుంది. ఇలాచేస్తే రచయిత తన సౌందర్యాభిరుచిని, రచనాశక్తిని, పోగొట్టుకొంటాడని భయపడనవసరంలేదు. దానివల్ల రచయిత ప్రజలకి దగ్గరై నూతన వ్యవస్థని స్థాపించేందుకు తోడ్పడుతాడు. అప్పుడే మానవజాతి కొత్తపోకడల్లో పురోగమిస్తుంది. నూతన వ్యవస్థ నిర్మాణానికై వచ్చే ప్రతీ విప్లవంతో పాటు సాహిత్యంలోకూడా మార్పులు వస్తూంటాయి.

మనదేశం స్వాతంత్ర్యం పొందినప్పటినుండి, జాతీయ ప్రభుత్వం అనేక సమస్యల నెదుర్కోవలసివచ్చింది. అందులో ప్రస్తుత ఆహార పరిస్థితి ఒక క్లిష్ట సమస్యగా ఏర్పడింది. అలాంటప్పుడు ప్రస్తుతపు యువకవులు కోయిలలంటూ, వసంతఋతువులంటూ, విరహగీతాలు గీచుకుంటూ సంతుష్టి పడాల్సిన రోజులేనా యివి? తమ నవకలాలన్ని హలములుగా చేసి ఆహారోత్పత్తికి తోడ్పడలేరా?

ప్రస్తుతం అంతర్జాతీయ పరిస్థితులు నానాటికీ విషమిస్తున్నాయి. ఈపరిస్థితుల్లో రచయితలు, సారస్వతాభిలాషులు, పోషకులు, చేయవలసిన కర్తవ్య మేమిటి? మానవజాతికే మారణహోమంలా యుద్ధజ్వాలలు రగుల్కొంటూ ఉంటే మనం చేతులు ముడుచుకొని చూస్తూ కూర్చోడమేనా? ప్రపంచపు అభివృద్ధి నిరోధక శక్తులు స్వలాభాలకై మానవకోటి రక్తంలో తమ చేతుల్ని ముంచి ఆనందంతో జీవించడానికి మరొక యుద్ధంకోసం భగీరథయత్నాలు చేస్తున్నారు. వాళ్ల ఆటలు స్వేచ్ఛగా కొనసాగించేటట్లు చేయడమేనా? కాదు. ప్రతీరచయిత ప్రపంచ ప్రజాశక్తులతోకలసి తన కలం, కత్తిగా చేసికొని యుద్ధోన్మాదులను ప్రతిఘటించి శాంతిని, నెలకొలిపేటట్లు శ్రమపడాలి. ప్రపంచం, మరో యుద్ధఘాటికి ఆగలేదు, మరోయుద్ధం మానవజాతికే ముప్పు.

## శ్రీమతి గిడుగు లక్ష్మీకాంతమ్మగారి ఉపన్యాసము

మనతోటి ఆసియాదేశమయిన కొరియాను తీసికోండి. దురాక్రమణ నరికట్టే నెపంతో మిత్రరాజ్యాలు ఇందులో అధికంగా పాశ్చాత్యదేశాలే - శాంతిదూత, నెహ్రూమాటల్ని పెడచెవినిపెట్టి, ఆ చిన్న దేశాన్ని ఉత్తరకొననుండి దక్షిణ కొనవరకూ భూమిని దున్నేసినట్లు మారణ యుద్ధయంత్రాలతో దున్నేశారే; ఆ చిన్నదేశం ఏంకాను? అనేక ఆసుపత్రులపై దయాదాక్షిణ్యం లేక బాంబులవల్ల వర్షం కురిపించారే; అచ్చట వుండేరోగులు, గర్భిణీస్త్రీలు, పసిపాపలగతి ఏమిటి? అది మిత్రరాజ్యాలు శాంతికోసంచేసే మానవకృత్యమా; లేక మానవరక్తంకోసంచేసే రాక్షసకృత్యమా? ఈ దారుణకృత్యాలని ప్రతిఘటించాలి. ఈ క్రూరాల్ని రచయితలు తమ రచనలద్వారా మూలమూలకూ తెలిపి యుద్ధవ్యతిరేకంగా ఒక గొప్పశాంతి ఉద్యమం తీసుకొని రావాలి. యీవిషయంలో రచయితలు అప్రమత్తతతో ఉంటే దారుణకృత్యాల కంతులేక ఆ కొరియాయుద్ధకణం ప్రపంచ యుద్ధజ్వాలయై సర్వనాశనాన్ని చేస్తుంది. విశ్వమానవ కళ్యాణానికి తిలోదకాలర్పించవలసివస్తుంది. యిప్పటికైనా రచయితలు, సాహితీపరులూ, పోషకులు, అభిమానులూ, మేల్కొనాలి. ప్రస్తుత పరిస్థితుల కనుగుణ్యంగా మన కర్తవ్యాలను అమలుపరచాలి.

కేరళ మహాకవి "వల్లత్తోల్" ఇటీవల వార్సాలోజరిగిన ప్రపంచశాంతి మహాసభలో తన మాతృభాషలో తన పద్యాన్ని చదివి, ప్రపంచ శాంతిపరులకు," ఇదిగో మా భారతదేశంలోని కవులం, శాంతి కోసం పెనుగులాడుతున్నాం. మరోయుద్ధాన్ని రానివ్వం," అని చాటించాడు. అలా చాటించి తన మాతృభాష గౌరవాన్ని కాపాడడమేకాక నెహ్రూదేశం శాంతినికోరే, శాంతికి అండగా నిల్చే గొప్ప దేశం అని తెలియజేశాడు. అలా 'వల్లత్తోల్' తన మాతృభాషలో శాంతిగీతాన్నిపాడి, "విశాల భారతంలో మళయాళం అనేభాష ఉందయ్యా,"అని ప్రపంచానికి చెప్పాడు. అటువంటి, కవులు, రచయితలు మనకిప్పుడు కావాలి.

---

"లేఖదూతలో" భర్తగారి ప్రశ్నకు లక్ష్మీకాంతమ్మగారి ప్రత్యుత్తరము.

---

"ఇంతటి రమ్యశైలి, దరళేక్షణ! ఎట్టుల వ్రాయుచుంటివి," వం
చెంతయు నబ్బురం బొదవ నేటికి? నేర్పుగ, వ్రాయలేనె? నా
స్వాంతముగాక నింకెవరు వ్రాయగనేర్పిరి? యెంచిచూడ, నీ
స్వాంతమె నీకుసాక్షి! సువిశాలహృదబ్జ! రమామనోహరా!

ఎన్నికకెక్కునేర్పున, నహీనధృతిన్ గడుసొంపు పెంపునన్
వన్నెయు, వాసియున్ గలిగి పండితపామరులెల్లమెచ్చు న
ట్లెన్నియొ పద్యరత్నముల నేను లిఖింపగ జూడలేదె! వి
ద్వన్నుత! నీవటులే మదిని పల్కుచు విస్మయమొంద నేటికిన్

(శేషం 139 పుటచూడుడు.)

---

గృహలక్ష్మి స్వర్ణకంకణ ప్రదానోత్సవానికి అధ్యక్షత వహించిన

# శ్రీమతి అన్నాప్రగడ చన్నఘంటమ్మ ఎం. ఏ. ఎల్. టి.

గారి ఉపన్యాసము.



పూజనీయులయిన డాక్టర్ కేసరిగారు, కంకణ గృహీతా, సభాసదులారా,

ఈ గృహలక్ష్మి జయంత్యుత్సవము, దానితోకూడ యీకంకణ ప్రదానోత్సవము, వర్షావర్షము, శ్రీ కేసరిగారు, అతివైభవంగా, కనుల పండువగా జరిపించుచునేయున్నారు. పెక్కురు విదుషీమణులు, కవయిత్రులు, సంఘసేవా పారీణులు, సంస్కరణాభిలాషులు, కళారాధకులు, సాహిత్యకోవిదులు తమ సేవా పాండిత్యాభినందన సూచకమైన యీస్వర్ణకంకణమును, యీవేదికనుండి అందుకొనియేవున్నారు; ఈ సన్మానమునుబొందియే యున్నారు. అయినప్పటికినీ ఈవుత్సవము మిగతా వార్షికోత్సవములవలెగాక, ఏనాటికానాడు, ఎప్పటికప్పుడు, ఒకనూతనమైన శోభతో వెలుగొందుతుందని చెప్పాలి ఎందువలన నంటే ఒక్కొక్క సంవత్సరము, ఒక్కొక్క విదుషీమణి ఈవేదికపై, విజ్ఞులు, పండితులు కవులు, మహానుభావులగు పెద్దలూ కొలువున్న ఈ నిండుసభలో సన్మానింపబడుతున్నారు. ఒక్కొక్కరు; ఒక్కొక్క ప్రత్యేకత గలవారు. ఒక్కొక్క విద్యలో ప్రత్యేక పాండిత్యమును, ప్రకర్షణను జూపి ప్రజలచే ఆమోదింపబడిన గౌరవ, విశిష్టతలను సంపాదించుకొన్నవారు. సంస్కరణోద్యమములో నడుము బిగించి, సంఘదురాచారములనూ, దుష్ట సంప్రదాయములను దునిమివైచి, విజయ విఖ్యాతిని గడించిన వీరనారులు కొందరు. బీదజనులను, పతితప్రజలను, వుద్ధరించుటకై విద్యా సంస్థలను నెలకొల్పి, వాసి జెందినయువతులు కొందరు. తమ పాండిత్యపటిమచే లలితకవితలల్లి, సాహిత్యలలామను ఏరినముత్యముల కంఠాభరణముల నొసంగిన సాహిత్యకోవిదలు కొందరు. తమ గానకళా మాధుర్యముచే ప్రజాహృదయము లను రంజింపజేసి, గాన సరస్వతిని చక్కగా కొలిచిన తల్లులుకొందరు. తమ చిత్రకళానైపుణ్యముచే, కళా ప్రపంచములో, చిరంజీవత్వమును నిర్మించుకొన్న యువతులు కొందరు. ఇట్లు వివిధ విద్యలలో, వివిధములుగ వున్నతస్థాయి పటిమను సంపాదించి, విద్వల్లోకమును మెప్పించి, తమ, తమ ప్రత్యేకతలను చాటుకొన్న నారీరత్నములు, ఒక్కొక్క సంవత్సరమున ఒక్కొక్కరుగ ఈకంకణ గృహీతస్థానము నలంకరించుటవల్ల ఈ వుత్సవమునకు ప్రతిసంవత్సరమూ ఒక ప్రత్యేకత, ఒక నూతనత్వము కలుగుచున్నది. మామూలుగా ప్రతి సంవత్సరము మనము జరుపుకొనే పండుగలు కూడ క్రొత్తఅల్లుడు వచ్చుననియో, క్రొత్తగా కోడలు కాపురమునకు వచ్చినదనియో, క్రొత్తగా శిశువు జన్మించెననియో, లేక కుమారున కుద్యోగమైనదనియో, ఏదియో నిట్టి ప్రత్యేక కారణమువల్ల ఒక క్రొత్తదనమును ఆ పండుగతో ముడిపెట్టి క్రొత్తశోభతో మనము పండుగలు జరుపుకొనుటలేదా! అదేరీతిగా దాత ఒక్కరేఅయిననూ, గృహీతయొక్క ప్రత్యేకవ్యక్తిత్వము వల్ల ఈ వుత్సవమునకు ఎప్పటికప్పుడు ఒక క్రొత్తదనం, ఒక క్రొత్తశోభ కలుగుతూవుంది.

ఈనాడు మనం ముఖ్యంగా సంతోషించవలసిన విషయం యింకొకటి కూడా వున్నది. కొంత కాలముగా, అస్వస్థులై, తమ అస్వస్థత కారణమువల్ల కేసరికుటీరపు స్వర్ణోత్సవమును కూడ సకాలములో జరిపించక, నిలిపినటువంటి డా. కేసరిగారు ఈ నాడు, ఈ వుత్సవమును స్వయముగా జరిపించి, కంకణ ప్రదానము చేయుట, గృహీత అయిన శ్రీమతి లక్ష్మీకాంతమ్మగారు, సభికులమైన మనమూ కూడ ఎక్కువ అదృష్టమని భావించి సంతోషించవలసిన విషయము. మందులకు లొంగని శరీరరుగ్మత, అవయవ పటుత్వమును క్షీణింపజేయు వృద్ధాప్యం, ఈ రెంటినీ కూడా అతిక్రమించగల మనోబలముతో, వారు తమ కర్తవ్యములను నెరవేర్చుచుండుట భగవంతునియొక్క ఆశీర్వాద ఫలమని భావించాలి. కేసరిగారొనరించిన దేశసేవ ఎరుగనివారు లేరు. ఆయన జగమెరిగిన బ్రాహ్మణుడు. 50 సంవత్సరములుగ లోధ్ర మొదలగు ఔషధములచే దేశదేశములందలి స్త్రీల రుగ్మతలను బాపుటచేతనేమి, రమారమి యిరువదియైదు సంవత్సరములుగ స్త్రీల విద్యావ్యాప్తికొరకై, స్త్రీ రచయితలను ప్రోత్సహించుటకై నడుపుచున్న 'గృహలక్ష్మి' పత్రికవలననేమి, వీరు భారతదేశములో అందరకూ సుపరిచితులే. చెన్నపట్టణంలో తెలుగు బాలురకు తమ మాతృభాషలో విద్యనభ్యసించగల నవకాశమును గల్గించి, తెలుగు పడుచులకు కూడ, ప్రత్యేకముగా నొక పాఠశాల నెలకొల్పుటకై ధన విరాళమునిచ్చి, తగిన ఏర్పాటులు చేయుచున్న శ్రీ కేసరిగార్కి మదరాసు ఆంధ్రులందరూ కృతజ్ఞులై యున్నారు. ఇంతటి సేవాపరులైనవారు పరిపూర్ణమైన ఆరోగ్యముతో యింకా కొంతకాలము తాము తలపెట్టిన వివిధ కార్యక్రమములు విజయవంతముగా కొనసాగునట్టి గట్టి పునాదులపై నిలచునంతవరకైనా, జీవించి యుండునట్లు భగవంతుడు ఆశీర్వదించుగాక.

ముఖ్యంగా ఈ రోజులలో, యిట్టి మహాపురుషులయునికి దేశమున కెంతయు ఆవశ్యకమైయున్నది. పూర్వకాలంలో కొన్ని శతాబ్దముల క్రిందటివరకూ, అన్నిదేశములలోకూడ, విద్యావంతులు, పండితులు కవులు, కళాకారులు, చిత్రకారులు, గాయకులు, రాజాస్థానములలో మన్ననలనందెడివారు. ఒకరాజ్యము యొక్క బాహ్యరక్షణకు సైనికదళమెంత ఆవశ్యకమో విద్యా, విజ్ఞాన, సంస్కృతుల రక్షణకు ఈపండిత దళముకూడా అంత అవుసరమేనని, పూర్వపురాజులు గుర్తించి, పండితులను తమ ఆస్థానములలో సకల మర్యాదలతో పోషించెడివారు. కృష్ణదేవరాయల అష్టదిగ్గజములు, భోజరాజు ఆస్థానములో కాళిదాసాదులను గురించి మనం వినియేయున్నాము.

రామభక్తులైన పోతన, త్యాగరాజు అయాచితముగా తమకు లభించిన రాజపూజ్యతలను ధిక్కరించిన ఘట్టములనుకూడ మనము చదివియేయున్నాము. కాని రాను రాను పండితులకు, ప్రభువాత్సల్యం లోపించుటచేత, రెండు, మూడు శతాబ్దాలుగా వీరు చీకటికోణాల్లో అష్టకష్టాలుపడుతూ, దారిద్ర్యాన్ని అనుభవిస్తూన్నారు. పరిస్థితులనుబట్టి వీరి నాదరించవలసిన బాధ్యత ప్రజలపైబడినది. అయితే, వివిధరంగాలలో, తమ కార్యక్రమాలలో నిమగ్నులయివున్న సామాన్య ప్రజ పండితులను గుర్తించగల సావకాశం, ఆదరించి పోషించగల ఆర్థికస్తోమతు లేకయున్నారు. అట్టి సందర్భంలో శ్రీ కేసరిగారు ఏర్పాటుచేసిన కంకణ ప్రదానోత్సవముద్వారా వారు విద్వన్మణులను గౌరవించుటతోపాటు, ప్రజలకూ, పండితులకూ ఒక విధమైన పరిచయమును గల్గించుచున్నారు. ఇట్టి వీరి సేవప్రశంసనీయమైనది.

ఈనాటి కంకణ గృహీత శ్రీ గిడుగు లక్ష్మీకాంతమ్మగారు విద్యావంతులూ, పండితులూ నగు కీ॥ శే॥ శ్రీ గిడుగు రామమూర్తిపంతులుగారి సహధర్మచారిణి.

బాల్యమునందు ఎక్కువ విద్యనభ్యసించక పోయిననూ, వారి భర్తగారి సహచర్యంలో మనుచరిత్ర వసుచరిత్రాదికావ్యములను చక్కగా చదివి, అందలి సారమును, సాంప్రదాయమును, సాహిత్యమును పూర్తిగా జీర్ణించుకొని, సహజమై, సరళమై, సాంప్రదాయసిద్ధమై, ఛందో నిబద్ధమైన భాషలో, లలితములయిన కవితలల్లి సాహిత్యవీధులలో, సుగంధపుష్పములను విరజల్లినారు. వీరి యాడబడుచును, కవయిత్రియు అయిన కీ॥ శే॥ శ్రీమతి జొన్నలగడ్డ శారదాంబ గారితో వీరికి ఏర్పడ్డ ప్రాణస్నేహం, సాహిత్య లోకంలో అపురూపమైనది. ఆదర్శప్రాయమైనదై వెలుగొంది, లక్ష్మీ, శారదా సుభాషితములను లోకమునకు ప్రసాదించినది. ఇందలి ప్రతి పద్యములోనూ చదువరులకు ఒకనీతి ఒక లోక మర్యాద, వుపమాన, వుపమేయపూర్వకంగా వుపదేశింపబడ్డది. వీరు రచించిన 'కుమారీ నీతి' హిందూయువతియొక్క ధర్మాన్ని ఎత్తి చూపుతూ వివాహకాలమందు ప్రతి యువతియూ వల్లించవలసిన వేదవాక్కులుగా నున్నవి. లోకమర్యాదలూ సంఘ పద్ధతులూ తారుమారై, వ్యక్తిగతమైన విలువలు, వివిధరూపములను దాల్చుచున్న ఈ తరుణంలో వీరి కుమారీనీతి ఒక చదువవలసిన పుస్తకమై, హిందూయువతియొక్క ఆదర్శము ఎంత వుత్కృష్టమైనదిగా, సంఘములోని ఆమె స్థానము ఎంత వున్నతమైనదిగా, ఆమెలోని సంస్కారము ఎట్టివున్నత స్థాయికి జెందియుండవలసినదిగా మన ప్రాచీన సాంప్రదాయములు నిర్ణయించియున్నవో, మనకు స్మరణకు తెస్తూవుంటుంది. వీరి 'లేఖగుచ్ఛ' ఈమెకు, ఈమె భర్తకూ జరిగిన వుత్తరప్రత్యుత్తరములు. ఇందులో వీరి యిరువురి అన్యోన్య అనుబంధములు ఎట్టి సాహిత్యసేవకు దోహదమైనవో తెలుపుచున్నవి ఈమెలోగల ఈ పాండిత్యమును అనేకులు గుర్తించలేక పోవుటకు ప్రస్తుత పరిస్థితులే కారణం. అందువల్ల యిటువంటి వుత్సవములు పండితులకు, ప్రజలకూ పరిచయము కలుగు నిమిత్తము అత్యంతము ఆవశ్యకమైనవి. ఇటువంటి అవకాశములను కలిగించుచున్న శ్రీ కేసరిగారు అత్యంత ప్రశంసనీయార్హులు.

మరియొక మాట. డా. కేసరిగారు తమ చిన్నతనంలో అతి దీనావస్థలో వున్న సమయంలో తమకు అన్నం పెట్టిన స్త్రీలయొక్క మాతృప్రేమకు కృతజ్ఞతగా ఆమాతృ హస్తానికి ఈకంకణం తొడుగుతున్నానని చెప్పుచున్నారు. వారి ఐశ్వర్యమునకు, అదృష్టమునకు కూడ స్త్రీలే కారణమని వారికి కృతజ్ఞత తెలియజేయుటకై అనేకమంది యువతులకు చదువులు చెప్పించి, ధన సహాయములు చేసి తుదకు కేసరీ కన్యా విద్యాలయమును కూడ స్థాపించి అనేకమంది బాలికలకు చక్కటి విద్యా సౌకర్యములను కల్పించి యున్నారు. ఒకరిద్దరు, తల్లులు తమకు, చేసిన సహాయము నిమిత్తముగ, వీరు వేనవేలు బాలికలకు, యువతులకు అనేక రకములయిన సహాయము, సౌకర్యములు చేయుచున్నారు. స్త్రీసామాన్యానికి వీరొనరించే ఈసేవకు కృతజ్ఞత తెలుపవలసిన బాధ్యత యావత్ మహిళా లోకానికీ కలదు. ఏ మాతృ వాత్సల్యాన్ని పూజించవలసిన లక్షణంగా, వుత్తమమైన గుణంగా, వారు ఈనాటి వరకూ అభినందించుచున్నారో అట్టి వాత్సల్యాన్ని కరుణనూ మన హృదయాల్లో నింపుకొని, వివిధరంగలలో వివిధ కార్యకలాపాలలో మనము వెల్లడించగలిగిన నాడే వారిసేవకు సరియైన కృతజ్ఞతను తెలిపినవారమగుదుము.

పూర్వకాలంలో స్త్రీలు తమ గృహమునకు మాత్రమే పాలకులై, తమ కుటుంబమును సంరక్షించుకుంటూ, అతిథి, అభ్యాగతులను ఆదరించుటకు వారికర్తవ్యమును నెరవేర్చుకొనెడివారు. వర్తమానంలో అట్లుగాక స్త్రీలు ప్రతి కార్య రంగములో ప్రవేసించి వుద్యోగములు చేయుచున్నారు. రాజ్యముల నేలుచున్నారు; సంస్థలను స్థాపించి నిర్వహించుచున్నారు. ఇట్లు ప్రతి కార్యరంగములోనూ, వున్నతమైన స్థానములను పొంది పనులు చేయుచున్నారు. వారు ఎక్కడెక్కడ ప్రవేసించుచున్నారో అక్కడక్కడ వారి మాతృ వాత్సల్యమును, చల్లదనమును వెదజల్లగలిగినచో ఈ ప్రపంచమునంతనూ ఆవరించియున్న యుద్ధభయము, అశాంతి త్వరలోనే చల్లారిపోగలదు. మారణ హోమాగ్ని గుండాలలో, మానవ జీవరాసులు లక్షలాదిగా యిసుక రేణువులవలె తేలిపోవుచున్నవి. ఈరోజులలో ప్రజలలో తిరిగి శాంతి వాతావరణము, భద్రత ఏర్పడాలంటే మానవసౌభాగ్యానికి మూలకారణమైన అమృత తుల్యమైన మాతృవాత్సల్యం అందరి హృదయాలలో పొంగి ప్రవహించాలి. ఆ ప్రవాహం స్త్రీలహృదయాలనుండే ప్రారంభించాలి. స్త్రీలోకం తమయందుగల ఈ గురుతర బాధ్యతను గుర్తించుకొని, తమకు సహజమైన కరుణను, ప్రేమను పెంపొందించుకొని సుస్థిరమైన లోకశాంతికి తోడ్పడగలరని నా హెచ్చరిక.

ఈనాటి కంకణ గృహీత అయిన శ్రీమతి లక్ష్మీకాంతమ్మగారికి నా హృదయపూర్వక అభినందనములు. ఈ వుత్సవములో ఈరీతిగా పాల్గొనుటకు నాకు అవకాశము నుకల్పించిన డాక్టరు. కేసరిగారికి నా కృతజ్ఞత.

—(o)—

(135 పుట తరువాయి)

భవదాశీఃకలనా విశేషమున విభ్రాజిల్లుటం జేసి నా
కవితావల్లరి పల్లవించె జుమీ; సత్కావ్యానుకూలంబునై
భువి బెంపొందెను; నీకృపాకలనచే బొల్పార గంటిన్ జుమీ
భవదాదేశ ఫలంబు; నద్దిమఱవన్ భావ్యంబె? ప్రాణేశ్వరా!

అతులిత మాధురీగరిమ యబ్బుటలెల్ల దలంప, దేవ! నీ
కతన నెగాదె! వ్రాయగను గాదనినన్ ఎటునేర్చియుందు? ధీ
మతివి దయానురక్తుడ వమానుష తేజుడ వౌట, వాఙ్మయ
ప్రతిభ గ్రహించి గ్రంథముల వ్రాయుటకున్ దగ బ్రోత్సహింపవే?

(11-11-34 లేఖ.)

—(o)—

# గృహలక్ష్మీ స్వర్ణకంకణ ప్రదానోత్సవానికి

ఆశీర్వచనములు

శ్రీకలితుడు ధీకలితుడు ప్రాకట విజ్ఞానధనుడు ప్రాకృత పుణ్యుండౌ
కేసరి వర కృపచే ఏకాలము వృద్ధిపొందుమీ గృహలక్ష్మీ!

స్త్రీజనాభ్యుదయంబు చిందులాడగజాలు సాంఘికరచనల చక్కదనము
గృహిణీమణులకెల్ల గృహపద్ధతుల్ దెల్పు మురిపెంపు భావాల ముద్దుపల్కు
వర పాకకళ పొందుపఱచు నేర్పునందున తాండవించే తీపి తలపు పిలుపు
విజ్ఞాన మాధురుల్ విబుధజనప్రీతి నొసగించు నవకవిత పసల మురుపు.

కలిగి భాషాధురీణవై ప్రతిభ గాంచి సరస సాహిత్య కళసొంపు పరిమళింప
చతుర వ్యాస రసోక్తుల సారమనగ వరలు గావుత గృహలక్ష్మి ధరణియందు.

శారదా పీఠమై శైలజావాసమై పొందు నీగృహలక్ష్మి మందిరంబు
ఇందిరా సుందరీ మందిరానందమై పొందు నీగృహలక్ష్మి మందిరంబు
ధనదుని పేటియై ఘనశచీగేహమై పొందు నీగృహలక్ష్మి మందిరంబు
సాహితీ నిలయమై సౌభాగ్య ధామమై పొందు నీగృహలక్ష్మి మందిరంబు

కళల దీపించు స్త్రీజన కల్పకంబు మంగళాశీస్సులకు శుభ మందిరంబు
నవ్యభారతి కానంద నందనంబు శ్రిత జనంబుల కిలను సుశ్రీకరంబు.

నిత్య కళ్యాణంపు నిలయమై వర్ధిల్ల జాలు నీ కేసరీనిలయ మవని
విజ్ఞాన సంభూతి వెలయింపగా జేయ జాలు నీ కేసరీనిలయ మవని
బహుళ సన్నుతుల సంపదలతో ముదముతో జెలగునీ కేసరీనిలయ మవని
భావి విజ్ఞానంపు ప్రతిభతో కృతులతో అలరారు నీ కేసరీనిలయ మవని

తెలుగు వాణికి కళ్యాణ నిలయమనగ మధుర మంజుల భావంపు మహిమగల్గి
రచన లింపొంద గలయట్టి ప్రతిభగల్గి పెక్కు వర్షంబు లిలపైన పేరుగాంచు.

# కవయిత్రులు, కవికుమారులు అంపిన పద్యరత్నములు.

కేసరిగారి ప్రశంస

ఆర్య కేసరివర్య నీకనవరతము ఆయురారోగ్య భాగ్యమ్ము లమరుగాత!
ధరణి నేటేట కంకణోత్సవము నిటులె జరుపగలవీవు చేజేత సంభ్రమముగ.

కవితయందును కళలందు కడుసమర్థతను వహింపగ ప్రోత్సాహమును నొసంగి
పృథుల సత్కారమున గౌరవించుటెల్ల మహిత ధర్మంబు నీకది మాన్యచరిత.

నవ్య సాహిత్య ఫణితి కానందమొంది తెనుగు నుడికారములగల్పి తీయనైన
వచనరచనల నింపుగ వ్రాయగల్గు కాంతలను గౌరవించిన ఘనుడ వీవె.

బుధవరేణ్యులలోన సంపూజ్యుడౌట ఆత్మ సామ్రాజ్య పీఠమ్ము నధివసించి
కలిత నిక్షేప! నీకీర్తికాంతతోడ బహుళ సౌఖ్యంబు లిలలోన బడయ గలవు.

బాల బాలికలకు తెన్గుపాఠశాల వేడ్క స్థాపించి నడపించి వేవిధముల
మెలసి పోషించుటెల్ల నీయిలను వృద్ధిపొందుచున్ సంస్థవిజయము పొందగలదు.

వాణీసతిన్ సతము వర్ణింప గలిగిన వరపుణ్య ఫలమిట్లు పండెనేమొ
పుణ్య గోదావరిన్ బుట్టి పెరిగినయట్టి ఘనత నివ్విధమున గంటినేమొ
కవితా కుమారిని కరకంజముల బెంచ గలుగు పుణ్యం బిట్లు గంటినేమొ
కారుణ్యమయి కల్పకాంబికా క్షేత్రాన వసియించు భాగ్యమీ భాగ్యమేమొ

అనుచు దోపించు మదికి నయ్యారె యనగ ఘనత కేసరిదత్తకంకణము గొనుట
కవిత కిల భూషణంబై గ్రాలుచుంట ముదము నావాణి కరకంజమున ధరించు.

(కంకణ గృహీత) గిడుగు లక్ష్మీకాంతమ్మ.

◆ ◆

శ్రీరామామణియును గౌరీరమణియు వాణియొపుడు చెల్వలరగ నీ
కారోగ్యసంపదల నవ్వారిగనిడి సతముబ్రోచు వరగృహలక్ష్మీ.

విదుషీమతల్లుల ముదితవై యర్చింప కంకణమ్మును మున్నెగట్టినావు
కాంతామణులపాలి కల్పకంబననొప్పు వరగృహలక్ష్మివై వరలినావు

వనితల కారోగ్యవరదాత్రియై భువిమించు లోధ్రను వెలియించినావు
ఆంధ్రభోజుడనంగ నలరు శ్రీ కేసరి పటుకీర్తి పెంపొంద ప్రబలినావు

ధరణి తామరతంపర కరణినలరి ఆంధ్రభాషాభివృద్ధికై యహరహములు
యెలమికృషిసల్పి ధన్యువై యెసగినావు యిటులె వేవేల యేండ్లు సర్వేశు కరుణ
ఆర్యగృహలక్ష్మి వర్ధిలుమమ్మ జగతి.

శ్రీకరమా వరగృహలక్ష్మి కంకణమలరనలరె మీ కరమున శో
భాకరమై శ్రీ శ్రీ లక్ష్మీకాంతా! కవి జనాళిగని ముదమందన్.

అక్కా! చక్కని శీలము మిక్కుటమాకీర్తి నలరు మిముపూజించెన్
నెక్కొనుప్రియంబునను మన చక్కని గృహలక్ష్మి బుధులు సన్నుతిసేయన్

కేసరిగారికి

శ్రీయును చిరతరకీర్తియు బాయని:శాంతం బఖండవైభవమును
సచ్ఛ్రేయము చిరాయురున్నతి యీయడ కరుణించి శ్రీశుడేలుత మిమ్మున్.

సన్నుతచరిత్ర నీదగు చిన్ననాటి ముచ్చటలు విన చెవులకు భూషణములు
యెలమి బుధతోషణంబులై యొసగె చదువ మహితభావోదయంబులై రహిచెలంగ.

అమ్మలుమున్నెన్నడో అన్నమ్మిడిరట నాటితెరగు స్మరియించుచు మో
దమ్మున నమ్మల కరకమలమ్ముల కంకణములిడు వదాన్యుడవు ధరన్.

దానంబునను కర్ణుదలపింపగా జేయు నేరుపునను నీకు నీవె సాటి
భువికవుల్ నిను ఆంధ్రభోజుడీతండన నెగడు కీర్తిగన నీకు నీవె సాటి
సరసగంభీర యశస్సాగరుండను నెరికీర్తిగన నీకు నీవె సాటి
మాతృసేవాసక్తి వైనతేయుండని వినుతింప నలర నీకీవె సాటి

పూత శ్రీకోటవంశాబ్ధిపూర్ణచంద్ర: మహిత భవ్యగుణాపేత మాన్యచరిత
మానినీలోక విద్యాప్రదానచతుర భాసురవదాన్య కేసరీ భూసురవర.

చిల్కపాటి సీతాంబ

♦ ♦ ♦

చవిగల చిన్నిగ్రంథముల చక్కగవ్రాసి తెనుంగు సీమలో
నవయుగమందుఁ బేర్వడసినావు సఖీమణి! రామమూర్తి గా
రవమున లక్ష్యముంచి జనరంజకమౌ కవితానురక్తవై
భువిపయి నెరుఁగఁబడని పుణ్యసునామముఁ గొంటి వమ్మరో!

గిడుగువరాన్వయంబు వరికింపఁగఁ బూర్వమునుండి కైతకున్
విడువని పెండ్లిపందిరయి వింతగు తావుల నీనుచుండు నా
యడుగుల జాడలో కులమహత్త్వ మొకింత కొఱంత లేక నీ
వడుగిడు చుంటివమ్మ వరవర్ణిని! ధన్యవు శంభుడోముతన్.

అతివల్ పూతచరిత్రలై మనగ నీయార్యామహామాత భా
రత కల్యాణి సుశోభితంబగచు సర్వారంభ సౌభాగ్య సం
భృతమై వర్ధిలునంచు లోఁదలచి సంప్రీతిన్ యశఃకాముడై
వ్రతముంబూని బహూకరించె కవితాబాంధవ్య మేపారఁగన్.

"సీదువల్లభుండు నిర్మించె శారదా గ్రంథమాల" ధరణి గణుతికెక్క
దానివైభవంబుఁదలచి శ్రీ కేసరి కంకణంబు నీకు కానుకబెట్టె.

లక్ష్మికాంతమ! శుభ "గృహలక్ష్మి కంకణము" నీకు లభియించె ధరన్
లక్ష్మికాంతునికృపచే నీక్ష్మవయి వర్ధిల్లుము కవీంద్రులు మెచ్చన్.

చేబ్రోలు సరస్వతీదేవి.

♦ ♦ ♦ ♦

శ్రీకరమై పండిత విభు నాకరమై లలిత కళల కాదర్శంబై
లోకంబున గృహలక్ష్మి సాకల్యముగాఁగ మనుత సజ్జననుతమై.

హరి హర హిరణ్యగర్భులు సిరివాణియు దేవకోటి సేవింపంగా
కగిమరుదుగ కొలువుండెడి వరకామేశ్వరి త్వదీయ వాంఛిత మొసగున్.

ఏటేటను యిటులే మీ వీటన్ కామేశ్వరమ్మ వేడుకతోడన్
హాటక కంకణ రవములు దీటుకొనన్ వెలయుగాత దినదినమిటులే.

సిరియున్న దానగుణమే యరుదందురు; భూరిదాన కమనీయార్ద్రా
కర కేసరి! నీకీర్తియు చిరతరమై ధాత్రియందు చెలగెడిగాతన్.

కలధౌత వలిపంబు చెలువారగా గట్టి కర్పూర గంధంబు కలయనలది
తారహారంబులు ధరియించి వాసనల్ బొదలు క్రొవ్విరులు కొప్పునను దురిమి
మంజుల మంజీర మాధుర్య నినదంబు దశదిక్కులకు ప్రతిధ్వని నొసంగ
కవి గాయకులు తాళగతి జూప దిక్కుంభి కుంభస్థలంబుల కొమరు మిగుల

నిలిచి వికసిత నవపద్మనేత్ర యగుచు ధిమితకిట తకధిమి తకధిమి యటంచు
నాట్యమొనరించె పాదవిన్యాస మలర కేసరీ! ధాత్రి నీదు సత్కీర్తి కాంత.

గంటి కృష్ణవేణమ్మ.

♦ ♦ ♦ ♦ ♦

వదినరో! స్వర్ణకంకణ శుభంబట! నీకట! యెంతపుణ్య సం
పద నొనరించినావొ తొలి బామున నాంధ్ర జగంబులోన; నీ
కిది యశమున్ ఘటించుఁ గవిబృందములోన విశేష కీర్తియున్
బొదలెడు లక్ష్మికాంతమ! ప్రమోదముఁ గల్గుఁ జిరాయురున్నతిన్.

మనసంఘంబున నింతకీర్తి మిగులన్ మాలక్ష్మికాంతమ్మ తె
చ్చినదంచున్ మనచెచ్చెలుల్ దలఁపరే! శ్రేయంబు వాటిల్లె నం
చును సభ్యుల్ దలపోయకుందురొకొ, నీశుద్ధ ప్రభావంబె యీ
ఘనమాకీర్తికిఁ గారణంబు వదినా! కాంతాశిరోరత్నమా!

వాజపేయయాజుల మహాలక్ష్మి.

♦ ♦ ♦ ♦ ♦ ♦

శ్రీ యుక్తాన్వయ దుగ్ధవారనిధి లక్ష్మిన్ బోలి జన్మించి, దే
శీయ ప్రాభవ ముగ్గుతోఁ గలచి, సౌశీల ప్రభావిద్యలన్
శ్రేయం బొప్పఁగగన్న శ్రీ గిడుగు లక్ష్మికాంత విద్వన్మణీ!
ఆయుర్వృద్ధి ఘటించి మాధవుఁడు నిత్యశ్రీల మిమ్మోముతన్!

జనముల్ మెచ్చఁగ నింతకాలమును భాషాసేవ సంప్రీతిఁ జే
సిన సాధృశ్య ఫలంబుగాఁ దెనుఁగు లక్ష్మీశారదా నీతులన్
బౌనరింపన్ గుఱుతించి కేసరియు సమ్మోదంబుగా స్వర్ణ కం
కణ సత్కారముజేసె, నింపుసభ, వేడ్కన్ గేలఁ గైసేయుమా!

స్వర్ణకంకణమిచ్చి, కేసరిమనీషి ధన్యతనుగాంచె, విద్యాప్రదాతలందు
కేలధరియించు; మాంధ్ర నారీలలామలందు ధన్యవు! లక్ష్మీకాంతమ్మ! నీవు.

కవిచంద్రులు, కోట సోదరకవులు. అష్టావధానులు.

♦ ♦ ♦ ♦ ♦ ♦ ♦

సురలకు మేటి యమృతమును హరియిచ్చిన భంగి భళిరె! యతివలకున్ కే
సరి ఇచ్చె లోధ్రః నిక నప్పరమాసవ మిచ్చు మేలు పలుకన్ వలెనే!

కామధేను చింతామణి కల్పతరువు లమరులకు నుంట గొప్పయే యవని జనుల
కాదరంబుగ లోధ్రయు నమృతలర్కు లనెడి త్రిమణుల గేసరియునిచ్చెగాదె.

సతులను విజ్ఞాన వతులను జేయుగా గృహలక్ష్మి పత్రికం గృషియొనర్చె;
ఆంధ్ర విద్యావ్యాప్తికై బడులనుపెట్టె; బీదల జదివించె పెక్కు జనుల;
చిననాటి ముచ్చటయని తనయాందర్శ జీవిత లక్ష్యంబు చేరవ్రాసె;
స్వర్ణకంకణదాన వ్యాజంబునన్ జేర్చె విదుషీమణుల నొక్క సుదినమందు;

సంఘ సంస్కరణములెన్నొ సలుపు నింక; కేసరి మహాశయుం డురుకీర్తి సంప
దాయురారోగ్యములతో శతాబ్దములకు వర్ధిలుంగాత భగవతి వరము కతన.

పలుకులు సొంపు గుల్కుచును భావగభీరములై వెలుంగగా
సలలితశైలి పొందుపడ సత్కవితల్ వెసనల్లు శక్తియున్
గలిగి యనారతంబు సిరికాంతుని భక్తియు మించినట్టి నిన్
తలచిన, లక్ష్మీకాంతసతి నాయెద ఎంతయు మోదమందెడిన్.

పతికి హితంబునా పరిచర్య సేయుచు పిల్లల గారాబు తల్లియగుచు
లోకహితంబై యనేక రీతిం తెన్గు గ్రంథముల్ వ్రాయుచు బంధుజనుల
వ్యవహారమెల్ల జయప్రదంబుగ జేసి ధృతి మించ సంఘసంస్కృతియొనర్చి
అన్నివిధంబుల నాదర్శగృహిణివై ఒలినొప్పుచున్నయో లక్ష్మికాంత

సోదరీ! నీ ప్రభావంబు జూచి నీకు ధర్మమయ కంకణంబు సన్మానమిచ్చె
న్యాయరీతి గేసరి మహనీయుడెల్ల జనులు బుధులు మానంబున సన్నుతింప.

యం. యస్. సీతాదేవి.

♦ ♦ ♦ ♦

స్వర్ణకంకణ బహుమాన భాగ్యరేఖ నీదు మణిబంధరేఖతో వియ్యమందె
కేసరి వరప్రసాదిత కీర్తిధనము లక్ష్మికాంతమ్మ! నిత్యకల్యాణమమ్మ!

గిడుగు వేంకట రామార్య గృహిణి వీవు; స్నేహలతలోని పుష్పప్రసిద్ధ వీవు;
మాకు సోదరివైన సమ్మాన్య వీవు లక్ష్మికాంతమ్మ! సత్కళా లలితవమ్మ.

తెలియనయ్యెను గంకణ దివ్యకృతికి నీవు తగుదువనుచు నిర్ణయించి రనుచుఁ
గేసరి మహాశయుని స్వర్ణకీర్తిలతకు ఆణిముత్తెంబవై గ్రాలుమమ్మ సతము.

అతి సుకృతము గృహలక్ష్మి తత హేమవరాంక షాతులితంబగు భాగ్యం
బతివల తలమానికమై స్తుతమతివై వోలుచుఁగాత శుభకృతిఁగనుచున్.

సదమలవై దుమీపటిమఁ జాటెడు శ్రీ గృహలక్ష్మి కంకణం
బొదవెను నీకు నేఁడు; ముద మొందెను; సంఘము సభ్యురాండ్రలో
మొదట సరస్వతీసతి విభూషిత యయ్యెను; దద్వితీయ వీ
యదనున స్వర్ణకంకణ సమర్పణకున్ దగితీవు సోదరీ.

భారతాంబిక సౌభాగ్యవైభవంబు సర్వజగదేక విజ్ఞానసముదయంబు
పూజ్యగృహలక్ష్ములకు స్వర్ణభూషణంబు ననెడు దివ్యయశంబు ధన్యతను గనుత.

రా. కం. అణ్ణన్ సంపత్కుమారాచార్య.

♦ ♦ ♦ ♦ ♦ ♦

కేసరి స్వర్ణకంకణము కీర్తికి భూతికిఁ గారణంబు నీ
కేసరి సార్థకాఖ్యవయి కీరితిఁగాంచిన కాంత వేష ల
క్ష్మీసతి వేష రామకవి శేఖరమూర్తికిఁ బత్ని వేష నా
కేసరి తూచియిచ్చెనిదికే సరివచ్చు సతీమతల్లికిన్.

వ్రేలు రవంతయైన వంపించుకోనని గిడుగు వంశాబ్ధిచంద్రుండు కీర్తిశాలి
రామమూర్తికిఁ బత్నిగాఁ బ్రబలు కాంతకిచ్చు స్వర్ణకంకణము సంవృద్ధినిచ్చు.

కేసరి నాకు మిత్రమణి; కీరితిఁగాంచిన భాగ్యశాలి ల
క్ష్మీసముదంచిత ప్రభల మించిన భోగపరాయణుండు; వి
ద్యాసతి కిల్లు కేసరిగృహంబు తెలుంగు ప్రపంచమందు; నీ
కేసరి కంకణంబు సతికిన్ గృహలక్ష్మికిఁ గీర్తిఁ దెచ్చెడిన్.

శారద లక్ష్మీకాంతల ప్రశస్త మనోహర తత్త్వ సూక్తులి
ద్ధారుణిఁ జంద్రకాంతివలెఁ దద్దయు వెల్గుచునుండెఁ బద్యపుం
ధోరణి గొప్పదంచు విబుధుల్ కొనియాడిరి పెక్కుసార్లు వా
గ్ధోరణి శ్రావ్యమై తనరు కోమలగాత్రులు నాదమందునన్.

మాలక్ష్మీకాంతము పెక్కేలా? శ్రీరామమూర్తి నెన్నఁదగఁ గొల్వం
జాలిన సాధ్వీమణియై గ్రాలుచునుండు కవయిత్రి ప్రతిభాసతియున్.

ఎన్నికఁగన్న మూర్తి; కవులెన్నఁగఁ జాలినమూర్తి; మేటి సం
పన్నిధిఁ గాంచుమూర్తి; విభవ ప్రభవంబును గాంచుమూర్తి; పే
రెన్నికఁగన్నమూర్తి; యశమెంతయుఁగాంచిన దివ్యమూర్తి; మా
యన్నకు రామమూర్తికి జొహారు లొసంగెద నిట్టివేళలన్.

లక్ష్మీకాంతమ్మ కవయిత్రి లక్ష్యమొదవ పతిపదారవిందమ్ముల భక్తియుక్తి
రక్తిఁదనరెడు రీతి నాసక్తిఁ గొల్చి తెలుఁగుకవితా కళారేఖ వెలుఁగఁ జూపె.

సోదరి లక్ష్మీకాంతమ ! విశుద్ధచరిత్రవు నీవు నేటి స
మ్మోదముఁ గూర్చు నీకవనముల్ మఱిఁ దత్త్వమనోహరా కృతుల్
మేదినిఁ జంద్రకాంతివలె మిక్కిలి వెల్గుచునుండె నిట్టి సం
పాదన శాశ్వతంబగు శుభంబగు సర్వయశస్కరంబుగన్.

మన స్నేహలతా సంఘంబున కింతటి గౌరవంబుఁ బొల్పెసఁగన్ ద
క్కను జేబ్రోలు సరస్వతియును నీవును గంకణము బహూకృతిఁ గొంటన్.

లలిత కళాకరంబు గృహలక్ష్మియె యయ్యది యాంధ్రకేసరీ !
విలసితమై ప్రమోదమయి పెట్టనికోటఁగనుండె నాంధ్రకాం
తల తలమానికంబగుచుఁ దద్బహుమానము కంకణంబు కే
వలపరమార్థ నిష్ఠఁగల భామల కేతగు స్వీకరింపఁగన్.

రా. సు. రాట్క. వి.

* * * *

అమ్మా! శ్రీ లక్ష్మీకాంతమ్మా! యీ స్వర్ణకంకణమ్మిఁక నీ సొ
మ్మమ్మా! కైకొనుమమ్మా! కొమ్మా! కవిలోకనుతులు గురులాశిషముల్.
కేసరి నామమ్మున కీవే సరి; ప్రతివత్సరమ్ము విదుషీమణులన్
భాసురసువర్ణ కంకణ భాసితులన్ జేయుమయ్య వత్సరశతముల్.

యం. రామకృష్ణారావు

# శ్రీ చన్నఘంటమ్మగారి జీవితచరిత్ర

---

శ్రీమతి చన్నఘంటమ్మగారు పశ్చిమ గోదావరి జిల్లాలో పూళ్లవాస్తవ్యులైన రావుబహదూర్ శ్రీ కల్లి చిట్టిబ్బాయినాయుడుగారి పుత్రిక. వీరు పూళ్లలో పెద్ద భూస్వాములు, ఎద్దేపూడి ఎస్టేటుదారులు. శ్రీ విద్యాభిమానులు. సంస్కారప్రియులు. పూళ్ల హిందూమిడిల్‌స్కూల్ స్థాపకులు. పూళ్ల పంచాయితీ బోర్డుకు అనేక సంవత్సరాలు చైర్‌మన్‌గాను, పశ్చిమ గోదావరిజిల్లాబోర్డు మెంబరుగాను. ఇరిగేషను అడ్వాయిజరీబోర్డు అధ్యక్షులుగాను, కార్యనిర్వాహక సభ్యులుగను, పురపాలక వ్యవసాయరంగాలలో అనేకమైన అభివృద్ధులకు తోడ్పడ్డవారు. స్వంత భూములలో నవీనపద్ధతులతో వ్యవసాయసంబంధమైన అనేక ప్రయోగములు పరిశోధనలుచేసి రైతాంగమునకు తోడ్పడ్డవారు. రైతు మహాసభలకు, తెలగ మహా సభలకు పలుమార్లు ఆహ్వాన సంఘాధ్యక్షులుగాను, అధ్యక్షులుగానువుండి ఆ ఉద్యమంలో ఎక్కువగా కృషిచేసియున్నారు. పెక్కుమంది బీద విద్యార్థులకు, ముఖ్యంగా విద్యార్థినులకు చదువు నిమిత్తం విరాళములను ఇచ్చియు, వారి పాఠశాలలోఉచిత విద్యాసౌకర్యాలు ఇచ్చియు ఆదరించారు. ఏలూరు సి. ఆర్. రెడ్డి కాలేజిభవననిర్మాణమునకు, పలువిధములైన విద్యాసంబంధమైన ధర్మాలుచేశారు. వీరి కృషివలననే ప్రస్తుతం వీరిచే స్థాపింపబడిన పాఠశాల జిల్లాబోర్డు హైస్కూలుగా రూపొందిచుట్టుప్రక్క గ్రామములందలి బాలబాలికల విద్యాభివృద్ధికి తోడ్పడుచున్నది.

## విద్యాభ్యాసం.

చిన్నతనంలో ఈమె తన తండ్రిగారిచే స్థాపించబడిన హిందూ మిడిల్‌స్కూలో విద్యను అభ్యసించారు. పిదప స్కూల్ ఫైనల్ వరకు రాజమహేంద్రవరంలో చదివారు. బి. ఏ వరకు మద్రాసు క్వీన్‌మేరీ కళాశాలలోను, యం. ఏ. మద్రాసు ప్రెసిడెన్‌సీ కళాశాలలోను, యల్. టి లేడీ వెల్లింగ్‌టన్ ట్రయినింగ్ కాలేజిలోను చదివారు.

ముఖ్యంగా వీరు విద్యాభ్యాసంలో గడిపిన జీవితంలో, అనేకమైన బహుమతులను పొందకలిగినారు. అవన్నీ వీరు విద్యయందు ఉన్నతమైన ఉత్తమశ్రేణిలో పరీక్షలలో జయంపొందిన కారణంవలన సంపాదింపబడినవే. రాజమహేంద్ర వరంలో చదువుకొనే రోజులలో స్కూల్‌ఫైనల్ తరగతిలో ఉన్నప్పుడు ప్రప్రథమంగా ప్రారంభమైన "చెల్లాయమ్మ-రాజగోపాలాచారి" వారి 'సత్ప్రవర్తన బహుమతి'ని పొందారు. ఇంటరుమీడి యేటు తరగతిలో ప్రథమ తరగతిలో ఉత్తమశ్రేణిలో విజయంగాంచారు. బి. ఏ. లో మాతృభాషఅయిన తెలుగులో మద్రాసు యూనివర్సిటీలోకల్లా ప్రథమంగా వచ్చుటచేత వీరు బొబ్బిలిరాజాగారి బంగారుపతకమును పొందారు. ఎం. ఏ. లో కూడా మద్రాసు యూనివర్సిటీలో కల్లా ప్రథమంగావచ్చారు. వీరు ఎం. ఏ. 1936 సంవత్సరంలో ముగించారు. ఆ సంవత్సరమే వీరికి వివాహం జరిగింది; వీరి భర్తగారు సంఘ సంస్కరణ పరాయణులగు శ్రీ అన్నాప్రగడ కృష్ణారావు పంతులుగారు. పిదప లేడీవిలింగుడన్ ట్రయినింగు కాలేజిలో బి. టి. చదివారు.

వీరు 1941 సం॥ నుండి 1945 సం॥ వరకు లేడివిలింగుడను కాలేజీలో అధ్యాపకులుగా పని చేశారు. పిదప ఆ పనికి రాజీనామా ఇచ్చారు. 1946 సంవత్సరం లో శ్రీమతి గుమ్మిడిదల దుర్గా

బాయమ్మగారిచేత స్థాపింపబడిన ఆంధ్రమహిళా సభలో రాణీ రాజ్యలక్ష్మీ పారిశ్రామిక శాఖకు, కరెస్పాండెట్‌గా చేరారు. పిదప ఆంధ్రమహిళాసభకు సంయుక్త కార్యదర్శినిగాను, 1949 సం॥ జనవరినెల నుండి 'ఆంధ్రమహిళా' పత్రికకు సహాయ సంపాదకురాలుగను ఉన్నారు. ఇంతేకాకుండా ఇంకా పలు విధములైన సంస్థలలో ముఖ్యపదవులలో ఉన్నారు.

1948 సం. నుండి 1950 వరకు మద్రాసు విజువల్ ఎడ్యుకేషను మెంబరు. మద్రాసు ఫిలింసెన్సార్ బోర్డుమెంబరు. ఐక్యరాజ్య సమితి శిశుసంఘం రాష్ట్రకమిటీలో 2 సంవత్సరములు, ఎక్జిక్యూటివు కమిటీ మెంబరుగాను ఉన్నారు. 1949 సం. అఖిల భారతమహిళాసభ గ్వాలియరులో జరిగిన సందర్భంలో చెన్నపురి మహిళా సభతరపున ప్రతినిధిగా వెళ్లారు. గిల్డఫ్ సర్వీస్ స్త్రీల సబ్ కమిటీమెంబరు. ఆల్ ఇండియా విమెన్స్ కాన్ఫరెన్సు సిటీ సెంట్రలు బ్రాంచిలో మెంబరు. చిల్డ్రన్స్ గార్డను స్కూలు మేనేజింగు కమిటీలో మెంబరు. హిందుస్థానీ ఫిర్కా మైలాపూరు బ్రాంచిలో ఎక్జికుటివు కమిటీ మెంబరు.

గూడూరులో 1946 సం॥ కాటేజి ఇండస్ట్రీస్ కోవాపరేటివు సొసైటి వార్షికోత్సవానికి అధ్యక్షురాలు. ఈ మధ్య 51 సం॥ ఫిబ్రవరిలో పెరంబూర్‌లో ఉన్న (రావుబహద్దూర్ కలవల కన్నయ్యచెట్టి హైస్కూల్)లో జరిగిన ఆంధ్రభాషా వారఉత్సవంలో అధ్యక్షురాలు.



అయినను పెద్ద సంసారము నెట్లోఈదుచు ఆమె సరస్వతీసేవ విడువక చేయుచున్నది.

ఈ దంపతులకు ఏడ్గురు కుమార్తెలు ముగ్గురు కుమారులు. పెద్దబిడ్డ చి॥సౌ. సీతామహాలక్ష్మి పాలూరి వారికోడలు; భర్త యం. బి. బి. యస్ పరీక్షనిచ్చి మద్రాసు పిచ్చి ఆసుపత్రిలో అసిస్టెంటుసర్జన్‌గా ఉన్నారు. వారిపేరు డాక్టరు పాలూరి రామచంద్రరావుగారు. రెండవకుమార్తె చి॥ సౌ. కనక దుర్గాంబ మంత్రి ప్రగడవారి కోడలు. భర్త శేషగిరిరావుగారు నైజాం రైల్వేలో ఉద్యోగము చేయుచున్నారు. వీరు ఏలూరులో నుండిన శ్రీ రాజామంత్రి ప్రగడ భుజంగ రావుగారి తమ్ముడి కొమారులట. మూడవ అమ్మాయి చి॥ సౌ. చెల్లాయమ్మ ఇవటూరి వెంకటసూరిశాస్త్రి గారిభార్య. ఈయన మద్రాసు అక్కౌంటెంటు జనరల్ ఆఫీసులో ఉద్యోగము చేయుచున్నారు. మిగత ఆడబిడ్డలు నలుగురు అవివాహితలు. వీరిలో చి॥ భారతియు, సావిత్రియు కేసరిహైస్కూలునందు స్కూలుఫైనలు విద్యార్థినులు. చి॥ జానకి, పాపాయమ్మకన్న పెద్దదైనను, ఆటకాయతనమున విద్యవంకకు మరలనందున మొదటి ఫారములోనే చదువుచున్నదిగాని పాపాయమ్మ మాత్రము శ్రద్ధగా చదువుచు నాల్గవ ఫారములో నున్నది. ఇక మగపిల్లలలో చి॥ శ్రీనివాసరావు బి. ఎస్‌సి. ప్యాసై కేసరికుటీరమునందు కొంతకాలము పనిచేసి పిదప వెల్లి లా చదువుచున్నాడు. వీరు బాపట్లలో శ్రీమంతులగు బ్రహ్మాండం లక్ష్మీనారాయణగారి పుత్రికను వివాహమాడినారు. రెండవకుమారుడు చి॥ రామారావు బి. ఏ. ప్యాసై కొన్నాళ్లు శ్రీకోటంరాజు రామారావుగారివద్ద పిదప బెంగుళూరున పోథాన్ జోసెఫ్‌గారివద్ద పత్రికా రచనయందు తర్ఫీదు పొంది నేడు ఇండియన్ రిపబ్లిక్‌లో సంపాదకీయవర్గమున పనిచేయుచున్నారు. మూడవబాలుడు చి॥ విజయశంకర్ ఫస్టుఫారమ్ చదువుచున్నాడు. ప్రస్తుతము వీరు మద్రాసులోనే నివసించుచున్నారు.

ఈమె భర్త కీ॥ శే॥ వెం॥ రామమూర్తిగారికి కీ॥ శే॥ జొన్నలగడ్డ శారదాంబగారు సోదరి. ఈమెకూడ భాషావేత్త; కవితా విశారద. ఈమెభర్త శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి గారు ఎం. ఏ. ఎల్. టి. బి. యల్ ఆంధ్ర, ఆంగ్ల, హిందీ, బంగాళీ భాషావేదియేగాక, బహురచనా దురంధరులుగా ఆంధ్ర లోకమునకు చిరపరిచితులు. శారదాంబగారు 1944 లో కాబోలు కీర్తిశేషురాలైరి. (ఈమె ఛాయాచిత్రము ముఖపత్రమున ప్రకటింపబడినది.)

ఈమె కవితా కలాపమునారంభించిన తొలిరోజులలో శ్రీ శారదాంబగారు ఈమెకు తోడైనారు. అప్పటికామె భర్త సత్యనారాయణమూర్తిగారితోకూడ కలకత్తాలో కొన్నాళ్లుండి, వారితోపాటు కాశీ మున్నగు యాత్రలు సేవించుకొని - స్వదేశమునకువచ్చి అన్నగారిఇంట కొన్నాళ్లు విశ్రాంతి తీసుకొన్నది. అన్నగారివల్ల ఛందశ్శాస్త్రమునేర్చి కవితల్లుల సాగినది.

సామాన్యముగా తెలుగునాట మరదండ్రకు వొద్దిక అరుదు. "పిండిబొమ్మనుచేసి పీటమీద పెట్టి 'ఆడపడుచా' అని పిలువగానే అదరిపడిన"దని తెలుగువారిలో లోకోక్తి. అయినను విదుషీమణు లగు వీరిరువురు వొద్దికకల్గి "లక్ష్మీశారదలు" అని జంటకవయిత్రులుగా కవితలల్లినారు. వీరుభయులు వ్రాసిన "తిరుపతి వేంకటేశ్వర శతకమునకు (ఇంకను అముద్రితము) విజ్ఞప్తి వ్రాయుచు ఇట్లు శ్రీ శారదాంబ గారినిగూర్చి లక్ష్మీకాంతమ్మగారు ప్రస్తుతించియున్నారు:—

(178 పు. చూ)

# గృహలక్ష్మీ స్వర్ణకంకణ ప్రదానోత్సవము

—(0)—

2.3.51 శుక్రవారం నాడు చెన్నపురి రాయపేట యందలి కేసరికుటీరం భవనమున వార్షికముగా జరుగుచుండు గృహలక్ష్మి స్వర్ణకంకణ ప్రదానోత్సవము అతి వైభవముగా జరుపబడినది. ఈ సంవత్సరమున కంకణ గృహీత శ్రీమతి గిడుగు లక్ష్మీకాంతమ్మగారు. ఈ కంకణ గృహీతలలో నీమె 13.వ ఆమె. శ్రీమతి అన్నాప్రగడ చన్నఘంటమ్మగారు యం. ఏ. యల్. టి. గారు అధ్యక్షత వహించి అతిచాకచక్యముతో నీయుత్సవమును నడిపించిరి.

పూర్వకంకణ గృహీతలలో శ్రీమతి చిల్కపాటి సీతాంబగారు ప్రత్యేకముగా నెల్లూరినుండి యుత్సవ సందర్శనార్థమై విచ్చేసిరి. కార్యాంతరమున విచ్చేసిన కమ్ముల అప్పన్నగారు సభనలంకరించిరి. వీరు ఏలూరునందు యోగవ్యాయామాశ్రమమును స్త్రీలకొరకు నడిపించుచున్నవారు. వీరినిగూర్చి గత గృహలక్ష్మి సంచికలో (ఫిబ్రవరి 1951) ప్రథమకంకణగృహీతలు శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు సవిశేషముగ తమ శారదాలేఖయందు వివరించి యున్నారు. వీరుభయులును సకాలమున సభవారి కోరుక పురుపబడి వారిహర్షధ్వనుల చూరగొనిరి.

ఉత్సవమునకై నిర్ణయింపబడిన ముహూర్తము (సాయంకాలం 4 గం॥ లు) నకు మున్నే సభాప్రాంగణమంతయు సదస్యులచే కిటకిట లాడుచుండినది. కంకణప్రదాతలు శ్రీ కేసరిగారు అస్వస్థులగుట పదచలనములేకున్నను ఉత్సాహముతో అరగంటముందే మేడదిగివచ్చి ఏర్పాటులన్నింటిని స్వయముగా హెచ్చరించుచు జరిపించిరి.

కంకణ ప్రదానోత్సవమును తిలకింప విచ్చేసిన నగర ప్రముఖులు : శ్రీ మునగాల రాజావారు, బులుసు సాంబమూర్తి, శ్రీపతి రామమూర్తి, మైదవోలు శేషాచలపతి, రావుబహుదూరు బండి శ్రీహరి రావునాయుడు, యం. యస్. చెల్లం, గిడుగు సీతాపతి, వసంతరావు వెంకట్రావు, యస్. జి. ఆచార్య, బి. కామేశ్వరమ్మ, యం. యస్. సీతాదేవి, కస్తూరి రుక్మిణమ్మ, కొమ్మూరి పద్మావతి, రత్నాల కమలాబాయి, కస్తూరి నారాయణమూర్తిసతి, కె. లక్ష్మీరఘురాం బి. ఎ, శ్రీమతి సీతాదేవి, చంద్రమతి, ఎస్. సామ్రాజ్యం బండి శ్రీహరిరావునాయుడుసతి, జనమంచి సుగుణ, దుర్గాకుమారి, టంగుటూరి అహల్య, అచ్యుతుని గిరిజ, వడ్లమన్నాటి దామోదరరావు, డాక్టరు తిరుమూర్తి, తాడేపల్లి శాంతాదేవి, వేమూరి విశ్వనాథశర్మ, సూరపాటి వెంకటరాజు, పట్టం శేషయ్యశెట్టి, డా. దేశికాచారిగార్లు.

ఉత్సవదిదృక్షమానసులై వచ్చినయతిథులకు స్త్రీపురుషులకు ద్వారమునందే చి॥వసంతా శాంతా చివుకుల లక్ష్మీకాంతమ్మగార్లు పుష్పచందనాది సత్కారములొనర్చి లోన వారి నాశీనులగావించిరి. కుటీరము వ్యవహర్తలగు శ్రీ యస్. శేషగిరిరావు మీనన్ గార్లును, కోటవెంకటరంగయ్య, ములుకుట్ల మహదేవయ్య, అయ్యంగారు, అమంచర్ల రామమూర్తి, సి. సి. పున్నయ్య, ములుకుట్ల సుశీల, శారద (కేసరిగారి ప్రథమపుత్రిక) గార్లును ఉత్సవము జయప్రదముగా కొనసాగుట కన్నియేర్పాట్లను మెళుకువతో నిర్వహించిరి.

ప్రప్రథమమున కంకణ గృహీతయు అధ్యక్షురాలును మధ్యస్థమైయుండ సభకువిచ్చేసిన పలువురు పురంధ్రీమణులు సుఖాసీనముల నలంకరింపగా ఛాయాపటము తీయబడెను.

(184 పు. చూ)






## గోంగూర

గోంగూర ఆంధ్రదేశమందలి ముఖ్యమగు ఆకుకూరలలో నొకటి. ముఖ్యముగా తమిళులు ఆంధ్రులను "గోంగూర" అని మారుపేరుతో పిలుచుచుందురు. అనగా తెలుగువారలకు గోంగూర ఆప్యాయకరమైన శాకము అని వారి ఉద్దేశము.

గోంగూరలో సాధారణముగా దేశవాళి గోంగూర, ధనాసరి గోంగూర, కొండ గోంగూర అని మూడు రకములు. దేశవాళి గోంగూర కాడలు తెల్లగానుండి ఆకులు చిన్నవిగానుండును. రుచి కొంచము వగరు పులుపు కలసియుండును. గుంటూరుజిల్లాలో పైరగు గోంగూర రుచికరమైనది.

సాధారణముగా గోంగూరను మెట్టపైరగు - జొన్న, సొజ్జ, వరిగె మొదలగు వానితోబాటు పైరు చేయుదురు. వరిగె చేలలోనికూర చాల ప్రశస్థమయినది. దీనితో పెట్టిన ఉప్పుపచ్చడి చాలకాలము నిలవయుండుటయేకాక రుచికరముగానుండును. గుంటూరుజిల్లాలో ముఖ్యముగా వంగోలు తాలుకాయందలి రాచపూడి ప్రాంతమునందును, బాపట్ల తాలుకాయందలి ఆదిపూడి ప్రాంతమునందును పైరగు దేశవాళి గోంగూర చాల రుచికరమైనదేకాక ఆరోగ్యకరమైనదికూడాను.

ధనాసరి గోంగూర కాడలు దేశవాళి గోగులకంటె తెల్లగా నుండును. ఆకులు పెద్దవిగానుండును. ఇది చాల రుచికరమైనదియేకాక పథ్యకారికూడాను. బాలెంతలుకూడ భుజింపవచ్చునట.

కొండ గోంగూర కాడలు ఎరుపురంగుగా నుండి రుచి పుల్లగానుండును. దీని ఉప్పుపచ్చడి నిల్వయుండదు. ఆరోగ్యకరమైనదికాదు. పుళ్లు, తేపులు, పైత్యము మొదలగు జబ్బులు దీనిని భుజించుటవలన సంభవించును. దీనినిదూని గొడ్లకు మేతవేయుదురు. గోగు విత్తనములను వేయించుకొని ఉప్పు కారము వేసి పొడిగొట్టుకొని అన్నములో వేసికొని తిందురు.

గోగుకాయలనురుబ్బి కుడితిలోకలిపి గొడ్లకు పట్టినచో పాడివృద్ధియగును.

1923 సం॥లో కాకినాడలో కాంగ్రెసు మహాసభ జరిగినప్పుడు ఆహ్వాన సంఘము వారు గుంటూరు జిల్లానుండి గోగువిత్తనములు తెప్పించి, చల్లించి గోంగూరను పైరుచేసి, దానితో పచ్చడి పెట్టించి భోజనశాలలో నుపయోగించిరి. మహాసభకు వచ్చిన అతిధులు ఆంధ్రేతరులతో సహా దానిని తిని మెచ్చుకొనిరి.

మెట్టగ్రామాదులలోని ప్రజలు జొన్న, వరిగె, కొఱ్ఱ అన్నములలోకి, రాగిసంకటిలోకి గోంగూర పులుసుకూర, పప్పుకూర, పచ్చడి విరివిగా వాడుదురు. గోంగూర బలిష్టమైన ఆహారము. కాయకష్టముచేయు వారికి తగినదికూడాను.

గోంగూర, విత్తనములేకాక గోగునార, గోగుకట్టెలుకూడ చాల ఉపయోగకరమైనవి.

గోగులు బాగుగా పెరిగిన తరువాత నారవలిచి దానితో పగ్గములు, నులక పేనుదురు. వ్యవసాయమునకు పగ్గములు, మంచములకు నులక సహజముగా నాడుకలోనున్నవి. నులకకూడ తెల్లగోగునారతో పేనినది శ్రేష్టమైనది.

నారవలిచిన తరువాత గోగుకట్టెను పందిళ్లమీద, ఇండ్లమీదకప్పుటకు నుపయోగించెదరు.

ఆంధ్ర దేశములో ప్రజలజీవితముతో గోంగూర మిళితమై యుండుటచే దానికి సంబంధించిన సామెతలు, పొడుపుకథలు, పదములుకూడ వెలిసినవి.

'కొండమీది గోంగూర ఎంతకోసినా గుప్పెడు కాదు' అని యొకకథ. పాతపులికథను విప్పుమురుగాక.

''కొర్రన్నం గోంగూర లింగతాతా
మింగలేక చస్తినోయి లింగతాతా''

ముఖ్యముగా సామాన్యప్రజలకు సమితము అందుబాటులోనుండు ఆకుకూర గోంగూర.

సి. సి. పున్నయ్య.

(గోంగూర శాక పాక విధములు పిదపసంచికయందు క్రమముగా ప్రచురించబడును.)

# బ్రతుకు తెరువు

స్త్రీలు అవలంభింప దగిన బ్రతుకు తెరువు లక్షణాలను ఇదివరలో పలుమారు చెప్పి ఉన్నాము. ఏదైనా ఒకపని చేయడం వల్ల స్త్రీ తన చిల్లరఖర్చుకు తగిన ధనం సంపాదించడం ఒకపద్ధతి. ఆపనివల్ల స్త్రీ ధనరూపకమైన లాభం పొందకపోయినా ఇంట్లో అవసరములను తీర్చగల్గితే అదీ బ్రతుకు తెరువే అవుతుంది.

ఈ రెండవరకం పని ఒక్కటి ఇక్కడ వివరిస్తాను. కొత్త సంవత్సరాది వస్తున్నది. చైత్రవైశాఖాలలో వేపచెట్లు బాగా పూచి పిదప కాని పండుతున్నాయి. సంవత్సరాదిని వేపచేదు చేసుకొని తినమని పెద్దలు నిర్ణయించినారు. ఎంతటి? దరిద్రులైనా ఇంత వేపపూత తెచ్చుకొని నలిచి క్రొత్తచింతపండు గుజ్జుకలుపుకొని తిని పండుగ చేసుకున్నామని సంతోషిస్తుంది. వేపపూత సంవత్సరాదికి మాత్రమే తినదగినదికాదు. ఏటపొడుగునా అడపా దడపా తినదగిన దే.

అయితే ఏ ఒకటి రెండు నెలలో పూచి పిదప కాయలయ్యే పూత ఏటపొడుగునా ఎట్లాలభ్యమవుతుంది అని మీరడుగుతారేమో! వేపచెట్లు పూచేరోజుల్లో ఎంత పూత గాలికిరాలి వృధాగా దిబ్బపాలు అవుతున్నదో మీరుగమనిస్తే మీకేతెలుస్తుంది. అట్లాదానిని వ్యర్థం కానివ్వకుండా మెలుకువతో గృహలక్ష్ములు సంపాదించి జాగ్రత్త పెట్టుకోవచ్చు. సమీపంగా ఉన్న వేపచెట్టుక్రింద బాగాచిమ్మి శుభ్రంచేసి రెండు చాపలో లేకపట్టలో పరిస్తే గంటలో గంపెడుపూత రాలుతుంది. ఒకవారం రోజులు సేకరిస్తే సంవత్సరం పొడుగునా కుటుంబానికి కావలసిన వేపపూత దొరుకుతుంది. దానిని చక్కగా ఎండబెట్టి కుండలోనో డబ్బాలోనో లేక గోనెసంచిలోనో జాగ్రత్తపరచికొనిఉంచుకొని ఏటిపొడుగునా ఉపయోగించుకోవచ్చు. వేపపూతతో పచ్చిపులుసు చేస్తారు. ఇంకా నేర్పరులైన అనేకవిధాల దాన్ని రుచికరంగా అన్నంలోకి పనికివచ్చే సాధకములుగా చేస్తారు. అదిచాలా ఆరోగ్యకరమైన ఆహారవస్తువు. దానితో అనేకవిధాలైన ఔషధములను లఘువుగాచేసి ఉపయోగిస్తారు. ఆవివరములు గృహవైద్యములో ఇదివరకు తెలుపబడే ఉన్నాయి. ఈపూతనే ఎరుకలవాండ్లు మున్నగు ఆటవికలు సేకరించి ఆకాలమున మనవాకిళ్ల వద్దకువచ్చి అమ్ముతుంటారు. దానిని డబ్బులిచ్చి, పాతచీరలుఇచ్చి అవసరమైనప్పుడు మీలో కొందరు కొంటూ ఉంటారు. ఆ సేకరించడం మీరేచేస్తే అది ఆదాయంకాదా. దానినుపయోగించడం ఆరోగ్యమేకదా.

వేపపండ్లు, విత్తనములు గూర్చి వచ్చేనెలలో వ్రాస్తాను.

వేపపూత వేయించి దించి చిక్కని పులుసు బెల్లం కారం ఉప్పు ఉంచుకొని కలిపి తిరుగబోత వేయించి దించి అందుకలిపితే పొడిపొడిగా ఉంటుంది. అన్నంలో కలుపుకొని తినుటకు చాలా రుచిగా ఉంటుంది. సామాన్యంగా బ్రాహ్మణులు తద్దినములలో దీనిని చేయుదురు.

# ఇంటిపనులలో మెళుకువలు

(గతసంచిక తరువాయి)

ద్రౌపతీ సత్యభామల సంభాషణ.

ద్రౌపతి:- వదినా! ఇంకా, విను. నీ భర్తకు కూర్మిచెలికాండ్రెందరో ఉంటారు. ఆత్మబంధువులు, రక్తబంధువులు, అతనికిష్టులైన వారెందరో ఉంటారు. వాళ్లువచ్చినప్పుడు భోజనాదిసౌకర్యాలు వాళ్లకు చక్కగా అమర్చి ఆదరించు. కపటంగాని సక్రమమైన భక్తితో నిరంతరం గొడ్డుమనస్సుతో సంచరించు. నీభర్తలకు ఇష్టులు కానివారు నీకెంతకావలసినవారైనా ఆదరించకు.

మరింకోరహస్యం చెప్పుతాను విను. ప్రద్యుమ్నుడు మొదలైనవారు నీకూ కొడుకులవరసేకదా. వాళ్ళతోనైనాసరే, ఒంటరిగా ఒకేపీటమీదనో, అరుగుమీదనో, సోఫామీదనో కూర్చోకూడదు; అది తప్పుఅని తెలుసుకో. అబ్బా! స్త్రీలు తిన్నగా నడుచుకోవడం చాల కష్టమైన పనిసుమా! మంచికులంగలవాళ్లు, పతివ్రతలు, మంచిబుద్ధిగలవారు అయిన స్త్రీలతోనే స్నేహంచేయుము; చెడ్డవాళ్ళను చేరదీయకమ్మా.

ఈ ఉపాయాలన్నీ అవలంబించావంటే ఇవే నీకు అతిశయమైన సౌభాగ్యానికి మూలమవుతాయి.

సత్యభామ:-(చాలా ఆనందించి) వదినా! నీవు చాలా ధర్మములు తెలిసిన ఇల్లాలివి. నీభర్తలు చాలా హెచ్చైన కీర్తి ధనంగలవారు; ధైర్యం, తేజస్సు, బలము, శౌర్యము విశేషంగా కలవారు. వీరికెట్లాగూ రాజ్యపాలన లభిస్తుంది. వెనకముందూ చూచుకోకుండా మీకు అపకారంచేసిన ఆ దుర్యోధనుని భార్యలు దిక్కులేకుండా అల్లాడుతారు; దాన్నంతా నీవుచూచి సంతోషిస్తావు. మంచి బుద్ధిమంతులు, శౌర్యవంతులు అయిన కొమాళ్లనుగన్నావు; నీవేమీ మనసులో చింతించకు.

నీ కుమారులు, ప్రతి వింధ్యాదులైన అయిదుగురు ఇప్పుడు ద్వారకలో ఉన్నారు. వాళ్ళకేమీ కొరవలేదు. రుక్మిణి, సుభద్ర, ఇతర్లు వారిని తమకొడుకులకంటే ఎక్కువగా చూచుకుంటున్నారు. వాళ్లసంగతినిగూర్చి బెంగపెట్టుకోకు.

(సమాప్తం)

# గృహవైద్యము

**మునగపువ్వు** :-మునగచెట్లు మన దక్షిణదేశములో అన్నిప్రాంతములందును కలవు. మునగ కాయలను పులుసుగాను, ఆకుకూరగాను వంటచేసి మనయిండ్లలో భుజించు చున్నాము. మునగపువ్వు కూరకూడ రుచికరముగాను, ఆరోగ్యకరముగానుండును.

మునగపువ్వును ఎండబెట్టి చూర్ణముచేసి పూటకు 3 కాని నాలుగు కాని చిన్నముల ఎత్తు ఉదయము, సాయంకాలము సేవించినచో వాతపైత్యము, నేత్రవాతములు హరించును. కడుపులోని నులి పురుగులను ఎలికపాములను చంపి కడుపును శుభ్రముచేసి ఆరోగ్యమును కాపాడును.

ఈపువ్వులను లేహ్యముగా కూడ తయారుచేసి సేవించ వచ్చును. చూర్ణముకాని, లేహ్యముకాని క్రమముగా సేవించుట వలన త్రిదోషములు - వాతపిత్త శ్లేష్మములు కూడ హరించును. అనారోగ్యమువలన ఏర్పడిన అరుచిని పోగొట్టి అన్నహితవగునట్లు చేయుటకు మునగపువ్వు చాల ఉపకరించగలదు. మునగపువ్వును సాధారణముగా వేయించికూడ తినవచ్చును.

పచ్చిమునగ పువ్వులను వెచ్చజేసి కండ్లకు కట్టినచో కండ్లమంటలు, ఎరుపులు, నీరుకారుట మొదలగు కండ్లజబ్బులు నయముకాగలవు.

మునగ పువ్వును భుజించుట వలన ఆరోగ్యవంతులగుటయేకాక తేజో వంతులుగా కూడ నగుదురు.




శ్రీమతి
ఎ. పద్మావతిదేవిగారు

## తిండికి తికమకలు



నీలాటి రేవులో ...

"రండి రండి! అక్కయ్యగారూ! ఏమిటి విశేషాలు? ... అన్నట్లు ... మీయింట్లో నిన్నరాత్రి కేకలు వినిపించా యెందుకండీ?!" అన్నాది ప్రక్కింటి యిల్లాలు, బిందెతోముతూ.

"ఆ ...! అదా? - అబ్బే! ఏమీలేదు. దొంగవెధవ పెరటింటిలోకి జొరబడి ... చద్దన్నం దేవుకొని పట్టుకు పోయాడు! వీడికక్కుర్తిమండా!" అన్నాది చంకలో బిందె మెట్లపై పెడుతూ.

ఇదివిని; "అబ్బా ఎంత విచిత్రంగావుంది!" అని ముక్కుమీద వేలుపెట్టుకొని అన్నాదో పూర్వసువాసిని.

"అవునుమరి! తిండికోసం దొంగతనమని ఆశ్చర్య మెందుకు? ఎవరుయేపాటుకి బడ్డా సాపాటుకే కదా! పొట్టకోసమే యీతిప్పలన్నీ! ఆకలిమంటలమ్మా! ఆకలిమంటలు!!! ... తిండికి దొంగతనమే కాదు; ఇకముందు దోపిడులు కూడా జరుగుతాయి!!" అన్నాదో నవనాగరిక నాజూకుపిల్ల, గాజులు సవరించుకొంటూ.

"నిజం! నిజం!! చిన్నపిల్లవైనా బాగా చెప్పేవమ్మా! - మేం ప్రత్యక్షంగా ఆ బాధ అనుభవిస్తున్నాం! ఆకలిబాధ అంటే మాకు తెలుసు! ఒకపూట తింటే రెండవపూట ఉపవాసమే! ఎప్పుడైనా యింత అన్యాయం వుందీ? దిక్కుమాలిన కరువు బాగావచ్చింది - తెగవు తెంపూ లేకుండా వుంది ..." అని ఒకబీద యిల్లాలు అంటూవుండగా, ... ...

"అవును దొడ్డమ్మగారూ! మనం తిండిలేకపోతే సద్దుకోగలం కాని, పిల్లలు వూరుకోకుండా వున్నారండీ! వాళ్ళకు యేంచెప్పినా అర్థం కాకుండా వుందండీ! 'అమ్మా! అన్నమే' అంటారు. వాళ్లను చూస్తే గుండె నీరైపోతున్నాదండీ!" అని తన ఆవేదన వెళ్ళకక్కింది ఓ అమ్మ.

'ఆగండమ్మా! నేచెప్తా దీనిని గురించి,' అంటూ "మనం యెందుకు బ్రతికివున్నాం! ముఖ్యంగా తినడానికే. తిండిపూర్తిగ లేకపోతే బ్రతుకేలేదు! చూడమ్మా పాపం! ఎంతమంది కాలం మీదవున్న వాళ్లు-బక్క చిక్కి చొక్కి చప్పిదవడలతో కళాకాంతులు లేకవున్నారో! ఇట్టివారు పాపం కొన్ని చిత్రవిచిత్రమైన యెడతెగని వ్యాధులకు గురియై అకాలమరణం పొందుచున్నారు! ఎందుచేత? సరియైన పుష్టినిచ్చు సుపోషకమైన భోజనము లేకపోవుట వలనేకదా ... ఏమంటారు?" అనగానే బుగ్గమీద వేలువేసుకొని వింటున్న ఒకస్త్రీ వుషారుగా చేతులు తిప్పుతూ;

"దీనంతటికీ కీలకం రేషను విధానంలో వుంది!" అన్నాది ... ...

"అవును యిటువంటి ఆవక తవక విధానాలుంటే తిండికి యెన్ని తికమకలైనా వస్తాయి! ఈయిచ్చే

రేషను సరిగా తింటే సగం రోజులకైనా సరిపడదు! పోతే దీనివల్ల చీకటి బజారు వర్తకానికి బాగా దోహదం యిస్తున్నాది. లంచాలూ పంచాలూ పుచ్చుకోడానికి అవకాశ మిస్తున్నాది. అమానుషంగా అన్యాయంగా యేమీ యెరగని బీదవారిని బాధించడానికి ఉపయోగపడుతున్నాది! అయినదానికీ కానిదానికీ ప్రతీదానికీ రేషను పెట్టి మనకది దొరకకుండా చంపేస్తున్నారు!" అని ఒక శ్రీమతి వుద్రేకంతో వుపన్యసించగా.

"అవునమ్మా! ఈ రేషనులు వలన మనంపొందుచున్న కష్టాలు నష్టాలూ తలుచుకొంటూవుంటే గుండెలు గుభేలు మంటున్నాయి. ఈ దిక్కుమాలిన విధానాలకు యెప్పుడు గాలి వస్తుందో!!!" అన్నదో పెద్దముత్తైదువ ప్రాణం విసిగి!

"అవశ్యం మీరన్నమాట నిజమౌతుంది దొడ్డమ్మగారూ! త్వరలో; మునిసిపాలిటీలలో తప్ప మిగతా ప్రాంతాలలో రేషను తీసేయడానికి సంప్రతింపులు జరుగుతున్నాయి! బహుశా తీసేస్తారుట కూడా! అని ఒక గాలికబురు విన్నాం!!" అన్నాది చదువుకొన్న చిన్నది.

"తల్లీ! మాచల్లని కబురు చెప్పేవు! నీనోటి కబురైనా నిజమై, అదేజరిగితే, యింతగంజి త్రాగైనా బ్రతుకుతాం!" అంటూ నీళ్లునుంచుకొని నడకప్రారంభించింది ... తరువాత, మిగిలిన గృహలక్ష్ములు కూడా తమపని ముగించుకొని, యింటిముఖం పట్టేరు. వచ్చేవాళ్లు వస్తునే వున్నారు! వెళ్లేవాళ్లు వెళుతునే వున్నారు. జరిగేచర్చలూ; కాన్ఫరెంసులూ జరుగుతునే వున్నాయి! ... ...

# అమ్మ



బంగారుకడుపులో భద్రమ్ముగాదాచి విశ్వంపువెలుగున విడచె నెవరు?
గోరువెచ్చని నీరు కుదియించిపోయుచు తడియొత్తి ముద్దుల తడిపె నెవరు?
కమ్మనిపాటల కలరవధ్వనులతో ఉయ్యాలయందుంచి ఊపె నెవరు?
తనదురక్తము సుధాధారలుగామార్చి గ్రుక్కెడు గ్రుక్కెడు కుడిపె నెవరు?

గోరుముద్దల తాయమ్ము కొసరి కొసరి మంచిదుస్తుల ముస్తాబు ముంచె నెవరు?
చీకుచింతలులేని ఓ చిన్నమనిషి! ఆమె నినుకన్న బంగారు అమ్మకాదె!

చక్రవర్తినినైన చదువరినైనను "ఏమిరా"యనిపిల్చు ఎవ్వరీమె!
విప్లవరాణిని విదుషీమణినినైన "ఏమిటే"యనిపల్కు ఎవ్వరీమె?
ఒకరిజబ్బుకు తానపలికి పథ్యముచేయు వెఱ్ఱియిల్లాలు ఈ వెలది యెవరు!
ఒకరిపొట్టను నింప ఒదిగి పస్తులుమాడు పరమార్థజీవి యీపడతి యెవరు!

ఇట్టిఅధికార మీమెకు ఎవ్వరిచ్చె! ఇంత అనురాగ మీమెకు ఎట్లువచ్చె!
"అమ్మ"యను పదవి కడుమహత్తరమ్ము! అమ్మగాక మరెవ్వరీ అమరజీవి!

అన్నిమరపించు మధురిమ అమ్మయయ్యె; అన్నిమన్నించు మక్కువ అమ్మయయ్యె;
అమ్మకన్నను మించిన అంశయేది! అమ్మలేకున్న జగతిలో అందమేది?

అమ్మలేకున్న లోకము అసలుసున్న; అమ్మయేప్రేమ, ప్రేమయే అమ్మయయ్యె;
అమ్మహృదయమ్ము ఆర్ద్రమై సలరుచుండు; "అమ్మ"బిరుదమ్ము లోకాన అక్షరమ్ము.

"అమ్మ"యని "అయ్య"యని పేర్ల అంతమందు లేనివారలు "ఆంధ్ర"లో లేరుమిగుల
ఒక్కరిద్దరు చెదురుగా యుందురేమొ? ఆంధ్రులకు "అమ్మ" యన్న అత్యంత భక్తి.

అబ్బరాజు రంగారావు

# భాగ్యదేవతా, నిర్భాగ్యదేవతా?



శ్రీమతి లక్కరాజు పద్మ.

కళ్యాణి కలవారిబిడ్డ. పనిపాటలు స్వయముగాచేసి యెరుగదు. అతిసుకుమారి. తండ్రి రామచంద్ర రావుగారు మిగిలిన బిడ్డలనందరిని ఒకయెత్తు, కళ్యాణిని ఒకయెత్తుగా చూచుకొనేవారు. ఆయనకు కళ్యాణి పుట్టినతోడనే డిప్యూటి కలక్టరు పనియయినది. అందువల్ల ఆ తల్లిదండ్రులు మా భాగ్యదేవత అని మరీ ముద్దుగా చూచుకొనేవారు. దానికితోడు కళ్యాణికి లక్ష్మీకటాక్షమునకు తోడు సరస్వతీకటాక్షముగూడ అబ్బినది. ఆమె 14 వ సంవత్సరమునకే స్కూలు ఫైనల్ పరీక్ష ప్యాసు అయినది. కాలేజిలోకూడ ఆమె అందరిచేత విద్యామూర్తి అని అనిపించుకొన్నది.

రామచంద్రరావుగారు కళ్యాణికి తగినభర్తకొరకు వెతకి వెతకి దూరపు మునసబుగారికొడుకు నారాయణమూర్తికి యివ్వ నిశ్చయించుకొన్నాడు, నారాయణమూర్తికి ముగ్గురుతోబుట్టువులు, ఒక తమ్ముడు కలరు. B. L పరీక్ష ప్యాసు అయినాడు. తండ్రివలెనే యితనుకూడా మునసబు అగునని ప్లీడరీలో ప్రవేశించెను. కళ్యాణిపరీక్షలు కాగానే పెండ్లిఅతివైభవముగా రామచంద్రరావుగారు చేసిరి. కాని యేదో మామూలుప్రకారము పెండ్లిలో ఏవో చిన్నచిన్నతగువులువచ్చినవి కాని మొత్తముమీద పైకిరాలేదు.

కళ్యాణి అత్తవారు ఆమెను వెంటనే పంపమనిరి. తల్లితండ్రులకు యింత తొందరగా పంపటము యిష్టములేక పోయింది. కాని ఒకనికి యిచ్చినతరువాత మన యిష్టమేమి? అని నిశ్చయించి కళ్యాణిని తగు సారెతో అత్తవారింటికి పంపించిరి. ఇల్లు నిండినకోడలు వచ్చినదని మామగారు మురిసిపోయినారు. కాని అత్తగారుమాత్రము చదువుకొన్నపిల్ల! పనివచ్చునా! పాటవచ్చునా! ఏమోనమ్మ! రేపు మొగుడుకి ఎక్కడనైనా వుద్యోగమైతే ఏమిచేస్తుందో ఏమో! అని విసుగుగా మాట్లాడుతూ వుండేది. కళ్యాణి ఆడబిడ్డను మేనరికమే యిచ్చారు. అందుచేత ఆమె యిక్కడే వుండేది. ఆమెకు 4 గురు పిల్లలు. కళ్యాణి పిల్లలకు పెద్దలకు ఓపికతో చేతనైనంతవరకు ఏదో చేస్తూవుండేది. ఆమెచేసినది ఎవరికీ నచ్చేదికాదు. భర్తకూడ వారికితగినట్లు నడుచుకొనేవాడు. ఎందుచేతనంటే చదువుకొన్నవాళ్ళను కొంచము అదుపులో వుంచవలెనని ఆయనవుద్దేశము.

కళ్యాణివచ్చిన 3 నెలలకల్లా మామగారికి పక్షవాతమువచ్చినది. కోడలువచ్చిన వేళామహాత్మ్యమే మోకాని మామగారికి పక్షవాతము వచ్చినది అని నిందించేవారు. చముకుకాళ్ళపెద్దమ్మవచ్చినది అని అత్తగారు అనేది.

కళ్యాణి అతిశాంతముతో, ఓపికతో యిట్లు ఆరుమాసములు గడిపెను. నిమ్మళముగా ఒకపూట మడికట్టి వంటచేయనారంభించెను. దానివంటచేత మా అందరికి అన్నహితవు పోయినది. పసివానికి ఒకసారి డోకులు, చిన్నదానికి విరోచనములు, నీవు, నీకోడలు సుఖముగా వుండండి. మేము మాయింటికి పోతాము అని పెద్దాడబడచు అనేది. రెండవ ఆడబడచు మరదలు ఏమి సారెతెచ్చినదో చూద్దామని పూరునించి వచ్చినది. వచ్చిన 4,5 రోజులలోనే టైఫాయిడ్ జ్వరమువచ్చినది. కొత్తకోడలుపాదము నిర్భాగ్యపుపాదము అని నిందించారు. ఇట్లావుండగా కళ్యాణిమరిది స్కూలుఫైనలు పరీక్ష పోయినది. ఇదికూడా కళ్యాణి పాదమహాత్మ్యమే అన్నారు. రోజులు గడచుచుండెను. అదృష్టము కొంచముకూడా కలసి రావటములేదు. నారాయణమూర్తిని మునసబులిష్టులో వేయలేదు. మామగారుకూడా యిదంతయు యీకళ్యాణి నిర్భాగ్యం వల్లనే అన్నాడు. నారాయణమూర్తిగూడ తండ్రిమాటనే నమ్మెడు ఈ బెంగతోటి కళ్యాణి మామగారు కనులుమూశారు. అత్తగారు కళ్యాణిని చూచినప్పుడెల్ల మా యింటికి నిర్భాగ్యదేవతను కొనితెచ్చుకొన్నాము అని తిట్టిపోసేది. ఈ పైవిషయములనుబట్టి చూస్తే కళ్యాణి భాగ్యదేవతా? నిర్భాగ్యదేవతా?

---o---

# స్త్రీ హృదయం

వి. సరోజినీదేవిగారు బి. ఏ.

స్త్రీహృదయం హాలాహలానికీ, అమృతానికీ కూడా విహారభూమి యని పెద్దలంటారు. ఒక్క స్త్రీకేనా? పురుష హృదయానికి మాత్రం అమృతం, హాలహలం ఉండవా? ప్రకృతిలో మానవుని భావనా శక్తికి పరిమితేలేదు. ఈ భావపరిమితిలో ప్రతిహృదయం కూడా ఊహాప్రపంచంలో ఎన్నో కోర్కెలను తీర్చుకుంటూ ఉయ్యాల లూగుతుంది. ఇతరులెవరైనా యీ కోర్కెలను దొంగిలిస్తారేమోననే పిచ్చిభావం కూడా కలుగుతుంది. ఈ భావమే మన స్త్రీలను మరీయెక్కువగా బాధకలిగిస్తుంది. అందుచేతనే ఏ స్త్రీ కూడా తన భర్త ఇతర స్త్రీలతో ఏమైనా మాటాడుతుంటే చూచి సహించజాలదు. అలాగే పురుషులలో కూడా తమ భార్యలు పర పురుషులతో మాటాడుతారేమోననే భయంతో, ఇంటిలో ఆమెను పెట్టి బయట తాళంవేసి జాగ్రత్తగచూచి మరీ ఆఫీసులకు వెళ్ళే శ్రేష్టులెంతమందిలేరు! మానవ హృదయంతో సంబంధించిన ప్రపంచపు పోకడలను, వాతావరణాన్ని అనుసరించి ఒక్కొక్క హృదయంలో అమృతమో, హాలహలమో స్థిరవాస మేర్పరచుకుంటుంది. అవే ప్రేమ అసూయలు. పాలసముద్రాన్ని చిలికితే ముందు గరళం వచ్చింది. అమృతం కూడా ఆవెంటనే వచ్చింది. మానవజీవితంలో ప్రేమ అసూయలు సమయానుకూలంగా వస్తుంటాయి. హాలాహలమనే ఈర్ష్యను అమృతమయమైన ప్రేమగా మార్చవచ్చునుగాని అమృతం వంటి నిష్కళంక ప్రేమను మానవ హృదయం ఎన్నటికీ త్రోసివేయ జాలదు.

అది పదిహేనవ శతాబ్దమునాటి ఫ్రాన్స్ దేశంలో ఆర్లియన్స్ అనే పట్టణం. ఫ్రెంచివారికి, ఇంగ్లీషువారికి ఘోరయుద్ధం జరుగుతుండే రోజులవి. దేశంలో దరిద్రదేవత తాండవిస్తోంది. ప్రజలు నిరాశాపీడితులై త్రాగుడు, జూదము, మొదలైన వ్యసనాలకు లోనయ్యారు. వ్యాధి పీడితులై చనిపోయినవారు పోగా మిగిలిన ప్రజలను, ధనాన్ని కూడా ఆంగ్లేయుల ఫిరంగిదెబ్బలు బలి గొంటున్నాయి. అయితే ధనవంతులు మాత్రం బీదల రక్తమాంసాల్ని పీల్చిపిప్పిచేసి త్రాగుబోతులై తూలేవారు. వారికి రాజ్యంతో నిమిత్తం లేదు. దేశాన్ని ఎవరు పాలించినా, వారి ధనానికి, హోదాకు ఏదీ అడ్డుతగలదనే ధైర్యం వారికి. దేశభక్తి ఏ కోశాన్ని చూద్దామన్నా శూన్యమే.

అది సంధ్యాసమయం. పిల్లగాలులు అలసిన శరీరములకు హాయిని కూరుస్తూ జోకొట్టుతున్నాయి. కాని యుద్ధతీవ్రతలలో మునిగిన ప్రజలు పిల్లతెమ్మెరలకు లొంగి పోయెదరా? పెద్దభవనం. లోపల చాల అలజడిగా ఉంది. పరిచారికలు హడావిడిగా ఇటు అటు తిరుగుతున్నారు. ప్రతిగది కూడా సుందరమైన రంగు రంగుల తివాసీలతోను, ఆకర్షణీయములైన మేజాలు, కుర్చీలతోను అమర్చబడి ఉన్నాయి. మేడమీదగదిలో ఒకప్రక్క సుందరమైన పందిరిమంచమొకటి పట్టుపరుపుతోను, దిండ్లతోను అమర్చబడి ఉంది. ఆదిండ్లనానుకుని ఇరువదేండ్ల యువతి కూర్చొనియుంది. ఆదీపపు కాంతిలో ఆమె ముఖమెంత

సుందరంగా కనిపిస్తోంది! ఆమె ధరించిన సిల్కు వస్త్రాలు, కాలి జోళ్లు సహితమామెను ఓ మెరుపు తీగయేమో అని భ్రమింప చేస్తున్నాయి. ఆమెవేషాన్నిబట్టి ఎవరైనా గ్రహించగలరు. ఆమె ధనిక వర్గానికి చెందిన కన్య అని.

ఆమె కోపోద్రేకంతో తన మెడలోనున్న బంగారు గొలుసును పెదిమెలతో మెదుపుతూ, తన ప్రియునితో కాబోలు - చాల విసురుగా, కోపంగా మాట్లాడుతోంది. ఆమెకెదురుగా ద్వారం వద్ద నిలుచున్న లవెల్, ధూళితో నిండిన కవచాన్నిబట్టి, అతడొక సైనికుడనీ, చాలదూరం నుండి వచ్చాడనీ తెలుసుకోగలం. ఆమె ఉక్కిబిక్కిరి ప్రశ్నలకు జవాబులు చెప్పలేకుండా ఉన్నాడు.

“లవెల్! నన్ను విడిచి యుద్ధంలో పాల్గొనవలసిన అగత్యం నీకేమి వచ్చింది? సింహాసనమెక్కే రాజుల కుండ వలసిన శౌర్య ధైర్య బలాలు నీకెందుకు? ఏ దేశాన్నెవరు పాలిస్తే మనకేం?”

ఆమె అడిగిన ప్రతి ప్రశ్న అతన్ని ఒక్కొక్క బాణం వలె గ్రుచ్చుకుంటున్నాయి.

లవెల్ ఆలోచిస్తున్నాడు. ఆమెముఖంలోకి చూస్తూ “కేథరిన్! నీవావిధంగా అంటావని నేనెప్పుడూ అనుకోలేదు. ఇది మన ఫ్రాన్స్ దేశం. ఈ దేశంనుండి, ఆంగ్లేయుల్ని, దేశద్రోహుల్ని తరిమి పీడిత ప్రజలను రక్షించేవరకూ నాకు యుద్ధమే విధి. నాకే కాదు. ప్రతి ఫ్రాన్స్ దేశీయునికికూడా, కేథరిన్! మరి కొద్దికాల మోపికపట్టు. ఇప్పటికే ఆర్లియన్స్ను ఆంగ్లేయుల బారినుండి రక్షించగలిగాం. దేవదూత అయిన ఆ ఆర్లియన్స్ కన్య ఆధిపత్యాన చార్లెస్ను రెయిమ్స్ పట్టణంలో రాజ్యాభిషిక్తుని చేస్తే ...”

“ఆగండి!” కేథరిన్ ముఖం కోపంవల్ల ఎఱ్ఱబారింది. మంచందిగి గదిలో అన్నివైపులా తొందరగా పచార్లుచేస్తూ

“ఆదేవకన్య సంగతి నాకు విశదంగా చెప్పండి. వినాలని కుతూహలంగా ఉంది!” ఆమె ఏభావంతో ఆప్రశ్న అడిగిందో అతనికేం తెలుసు!

లవెల్ :- ఆమె నిస్సందేహంగా దేవుని కుమార్తె!

కేథరిన్ :- “హుం! నిస్సందేహంగానా?” ఆమెహృదయంలో అప్పుడే ఈర్ష్యా జ్వాలలు కొసలు వేస్తున్నాయి అనుమాన పిశాచం ఆమె హృదయంలో నుండి తొంగి చూస్తోంది!

లవెల్ :- అవును ఆమె చాలా ఉత్తమురాలు. ఆర్లియన్స్ను కాపాడినప్పుడు ఆమె చూపిన ధైర్య సాహసాలు చాలా కొనియాడ దగినవి. దేవతా సహాయమైన ఆజోన్ ఆఫ్ ఆర్క్ కన్య ఫ్రెంచి సేనానియై కత్తిని ఝుళిపించి గుఱ్ఱమెక్కి, వీరులకు వెనుకంజ వేస్తున్న తన దేశీయులకు ధైర్యసాహసాల నెక్కించిన వీర కన్య. ఆమెతోనున్న వారికి మరణమంటే భయమే యుండదు. నేనంటే ఆమెకు చాలా ఆదరం, అభిమానం, ఆమెకు ప్రియశిష్యుడను నేను!

కే :- అబ్బ! చాలు బాబూ, చాలు! ఆమె ఖ్యాతి దేశదేశాల్లో వ్యాపించింది. ఆమె, మీరు చెప్పిన దేవకన్యకాదు. తాంత్రికురాలు. దేవునిపేర, ప్రజలను, పురుషులను మోసగిస్తున్న విటకత్తె; తాంత్రికురాలు! ఇంతకూ, మీకు నేను కావలెనా, లేక ఆకన్య కావలెనా?

ఇంతవరకూ ఆమెమాటల నోర్పుతో వింటున్న ఆతడిక ఊరుకోలేక పోయాడు.

లవెల్:- చాలు! నీమాటలింక కట్టిపెట్టు. నీవింతమూర్ఖురాలవని నేననుకోలేదు.

అతడు తొందరగా ఆగదివిడిచి గుఱ్ఱమెక్కి శరవేగంతో అదృశ్యుడయ్యాడు.

ఆమెకళ్ళలో నుండి అశ్రువులు మితిలేకుండా కారుతున్నాయి. కుమిలి కుమిలి తనలో తానే ఏడ్చుకుంటోంది. దగ్గరలో గుఱ్ఱపు డెక్కల శబ్దమూ మెను విన్పించింది. ఎవరా అని చూస్తుండగానే ద్వారం దగ్గర ఒక అపరిచితుడు ప్రత్యక్షం! చాలా దూరప్రయాణీకునివలె నున్నాడు. యుద్ధసన్నద్ధుడై యున్నాడు. అతడామెను చూచి చిరునవ్వునవ్వి "చెల్లీ! ఈదుష్టుల్ని విప్పడంలో నాకు సహాయపడవూ! నీవిక్కడ ఉన్నావని తెలిసి చాల ఆనందించాను." అని ఎంతో మధురమైన స్వరంతో దీనంగా అడిగాడు. ఆమె కాదనలేకపోయింది. త్వరలోనే ఆ అపరిచితుడు తనవలనే స్త్రీ యని తెలుసుకుని ఆశ్చర్యపోయింది. రెండవ యువతి ఆ కారాన్నిబట్టి, ఆమె నిర్మలమైన మధురస్వరాన్నిబట్టి, ఆమె జోన్ ఆఫ్ ఆర్క్ అని గ్రహించింది. ఎవరివలన తనకు తన ప్రియునకు వియోగము సంభవించినదో ఆ స్త్రీ తన కండ్లఎదుటనే యున్నది.

కేథరిన్‌కు కోపము, క్రోధము, ఈర్ష్య ఎక్కువై పోయాయి. "దేశదేశాల్లో మంత్రకత్తె, మోసకారి యని ప్రఖ్యాతి పొందినది నీవేనా?" అని హేళనగా అడిగింది. జోన్ చాల జాలిగా కేథరిన్ వైపు చూసింది. ఆమె కండ్లనుండి రెండు అశ్రువులు రాలాయి. "చెల్లీ! పురుషులెన్ని అనుకున్నా నాకు లెక్కలేదు. కాని నాతోడి స్త్రీలే నన్నింతగా అపహసించి నాహృదయాన్ని గాయపరుస్తుంటే నేనేమి చేయాలో నాకర్థం కావటం లేదు. నేను బీదకుటుంబంలో పుట్టి దేవుని యాజ్ఞల్ని శిరసావహించి వానిని నెరవేరుస్తున్నాను. నేను నీకేమి అపకారం చేశాను?"

జాలిగొలిపే ఆమె మధురమైన మాటలు కేథరిన్ ఈర్ష్యాహృదయాన్ని వెన్న కరగబెట్టినట్లు కరగబెట్టాయి. తన తప్పును తెలుసుకుంది. జరిగిన సంగతంతా జోన్‌తో చెప్పి, పశ్చాత్తాపముతో ఆమె ఒళ్ళోతలదూర్చి ఏడ్చింది. జోన్ ఓదార్చింది. తనశిష్యులలో శ్రేష్ఠుడైన లవెల్ వీరుడు కేథరిన్ ప్రియుడని తెలుసుకుని జోన్ చాల సంతోషించింది. ఆరాత్రి ఆ యువతులిద్దరూ నిష్కల్మష హృదయాలతో ఒకరి కౌగిలిలో నొకరు నిశ్చింతగా సుఖంగా, నిద్రపోయారు.

యుద్ధం పూర్తి అయింది. జోన్ విజయాన్ని సాధించింది. లవెల్ కేథరిన్‌ను వివాహ మాడాడు. జోన్ లంచగొండ్ల చేతులలో పడింది. ఆంగ్లేయులు ఆమెను చెరబట్టారు. ఆమెను మంత్రకత్తె అని భావించి బ్రతికియుండగానే ఆమెను బంధించి కాల్చారు. ఆమెను వారి బారినుండి తప్పించే ప్రయత్నాలు విఫలమయ్యాయి. ఆమె తన దేవుని యొద్ద చేరుకుంది.

చనిపోతున్నప్పుడు కూడా తనను చూడగోరుతూ తనకొరకు కన్నీరు కారుస్తోన్న కేథరిన్‌కు జోన్ తన దివ్యదర్శనమునిచ్చి "చెల్లీ! దేశనాయకులు, గొప్పయుద్ధవీరులు కాబోయే పుత్రుల్ని దేశానికి అర్పించి నీవు వీరమాతవుకమ్మా. ధన్యజీవివి. చిరంజీవిగా వర్ధిల్లుము." అని అంతర్థానమైంది. స్త్రీ హృదయమెంత మృదువైనది. అది సమయానుకూలంగా హాలాహలాన్ని కూడా అమృతంగా మార్చగలిగే విహారభూమి సుమండీ!

---




ప్రతిమానవుడికి ఏదో ఒక అనుభూతి, అంటే ఎన్నడూ మరపురాని సంఘటన అనుభవమయ్యే వుంటుంది. అనేకులు, అనేకరకాలుగా దాన్ని అనుభవిస్తూ వుంటారు. అనుభూతి అంటే ఒకసమయంలో మానవుడు తన సర్వస్వమూ ఏదో ఒకదానికోసం, ఒకపనికోసం, తనకు మరపురాని అమరానందంకోసం పాటుపడి ప్రయత్నిస్తాడు. ప్రయత్నంలో విజయం చేకూరిన మానవుడు సంతోషానుభూతిని, విఫలమైతే విషాదానుభూతిని పొందుతాడు. ఏది ఎట్లావున్నా, మానవుడు ప్రతిదానికోసం ప్రాకులాడుతాడు. ప్రతిదానికీ ఆశపడతాడు. అతడు ఆనందింపచేసే వస్తువులంటే, తన ప్రాణానికి లంకెవేసుకుంటాడు. మానవజీవితానికి అంతులేదు. తృప్తిలేదు, సంతోషం లేదు. ఎన్నివున్నా, ఏదోతనకి లోపించినట్లే బాధపడతాడు. తనదారిని నిశ్చయంగా, ధైర్యంగా నడవలేడు. ప్రతివిషయంలోను తన్నిమించినవారు లేరని అభిప్రాయ పడతాడు. ఆ అభిప్రాయాన్ని తనమనసులో ధృడపరచుకుని, మురిసిపోతాడు. ఆఖరుకీ మురిపానికి ఫలితం, నిజంగా తృప్తిలేకుండా బాధపడటమే. అయినా గ్రహించడు. ఇంకా, ఇంకా తన స్థానం ఏదో, ఎవ్వరూ ఆశించలేనిదని, అన్నిటికంటే గొప్పదని, దానినంతా తను అనుభవించగలననీ గర్వపడతాడు. పట్టుమని తనమనస్సుని పట్టుకోలేని మానవుడు, ఎన్నిటికో దేవులాడుతాడు. ఇవి అన్నీ ఇట్లావుండగా, తనకి సంఘానికి సంబంధం కల్పించుకుంటాడు. తనుచేసే ప్రతిపనీ, చిన్నదైనా, సరే ఎదుటి మెప్పుకోసం ఆసించి, దానికోసమే చేస్తాడు. తన పరాపేక్షను చూచుకొని ఎంతో ఆనందిస్తాడు. ఇట్లా అని ఇంకొకమనిషికి సహానుభూతుడు కావటానికి ఎంతోబాధపడతాడు. ఏదైనాసహాయం చేసినా, మేడిపండు చందాన మెరుస్తాడు, సంఘంలో తనకున్న స్థానాన్ని గ్రహించడు. పెద్దవారి స్నేహం, ప్రాపకం కోసం పాకులాడుతాడు. చిన్నవారిని నీచాతి నీచంగా చూస్తాడు. ఎట్లావస్తుందీ వ్యత్యాసబుద్ధి ? ఆశ్చర్యం. పెద్దవారిని, ధనంకలవారిని, "మీరు" అని సంభోధించిన నాలిక, చిన్నవారిని బీదవారిని, "నీవు" అని అనటానికి వెనుదీయదు. మానవుని విజ్ఞానం ఇట్లావుంది. ఎదటి మానవుని వ్యక్తిత్వాన్ని, డబ్బుతోపోల్చి మాట్లాడుతాడు. అది అతనికి అవమానంగా తోచదు. తినటానికి అన్నం లేని దరిద్రులకు తను అన్నం పెట్టలేకపోగా అదరాభిమానములను కూడా చూపలేడు. కష్టపడి దేశానికి సేవచేసి, దారిద్ర్యబాధనుంచి దేశాన్ని విముక్తిచెయ్యటానికి ఆలోచించడు. దేశసేవ చెయ్యటంలో తన కేమాత్రం బాధ్యత వున్నదని గుర్తించడు. గొప్పకిపోతాడు. వ్యత్యాస బుద్దిని కల్పించుకుంటాడు. "ఇంటగెలిచి రచ్చగెలు" అన్నసామెతగా ముందుమనస్సులోవున్న వ్యత్యాస బుద్ధి మారాలి. ఒక గృహంలో స్త్రీ, పురుషుడు వుంటే, ఒకరికంటే ఒకరు ఎక్కువ అని బాధబడతారు గాని సానుభూతితోటి అదరభావం ఏదీ ?

ఒకమనిషిని సహనభావంతో చూడలేనివాడు, పదిమందిని ఎట్లాచూస్తాడూ? దేశాన్ని ఏవిధంగా గౌరవిస్తాడు? ఈవ్యత్యాసబుద్ధితో తను ఆనందగా అనుభవించవలసిన సంసారాన్ని దుఃఖసముద్రంలా చేసుకుని, అందులోపడి, ఈదులాడుతూ వుంటాడు. ఏదానివల్ల తను బాధడుతున్నాడో, తను అవగాహన చేసుకోలేడు. ఒకవేళ చేసుకున్నా ప్రజ్ఞకోసం, దాన్నేపట్టుకుని బ్రతికున్న పదిపూటలు నరకం అనుభవిస్తాడు. తనమనస్సుకు అన్యాయంగా ప్రవర్తిస్తాడు. మనస్సు న్యాయమైన దోవచూపితే, తనువానికి వ్యతిరేకంగా వుండటానికి ప్రయత్నించి, నిర్దాక్షిణ్యంగా తన మనస్సుని హత్యచేసుకొంటాడు. దానివల్ల ఫలితంకితను ఒక కర్కశకుడుగా తయారవుతాడు. ప్రతిదానిని ఖండిస్తాడు. ఆలోచన చచ్చిపోతుంది. క్రూరంగా ప్రపంచంలో తిరుగుతాడు. దేముడు తనకిచ్చికి తన మహత్తర శక్తిని, పటుత్వం లేనిదాన్నిలాగా తయారు చేస్తాడు. దేహబలంతో ఏకొద్దిమందికో పాటుపడి, సేవచేయగలడు కాని, బుద్ధిబలంతో, మహత్తరమైన ఆసక్తితో, దేశదేశాలకీ, మేలు, కీర్తితీసుకు రాగలడు. ఆదోవ మానవునియందు కలిగే గొప్ప అనుభూతికి కారణంగా వుంటుంది. దానిని గ్రహింపటానికి పెద్దచదువులు అక్కరలేదు. డబ్బుతోపనిలేదు. ఒకరిని అనుసరించవలసిన అవసరంలేదు. దృఢనిశ్చయంతో, నిశ్చితాభిప్రాయంతో తన దృష్టిని కేంద్రీకరించి మనస్సుతో ఏకీభవించాలి. ఒక విషయం మనం గుర్తుంచుకోవాలి. కొంతమంది పెద్దవాళ్లు కూడా అబద్ధం ఆడతారు. ఎందుకనీ? సత్యంమీద వారిమనస్సుకు దృఢత్వం లేదన్నమాట. అబద్ధం ఆడినందుకు పశ్చాత్తాపం కూడా వుండదు. మనస్సు ఆవిధంగా మరుగు పరుస్తారు. హృదయం, అసత్యం వీటిమీద ఏమాత్రం నిశ్చితాభిప్రాయాలున్నా అబద్ధం ఆడటానికి బాధపడతాడు, మనసార చేసినపనిలో మానవుడు తృప్తిపడతాడు. ఆనందిస్తాడు. అదిమానవుని అనుభూతి. మనసార చేసినపనిలో కృతకృత్యుడై తద్వారా సంతోషానుభూతిని పొందుతాడు. వ్యత్యాస బుద్ధితో మానవుడు దుఃఖాన్నే చూడగలడు. మానసానందం శరీరారోగ్యానికి కూడా కొంతకారణంగా వుంటుంది. మానవజాతిలో ఈవెలుగు దేశసౌభాగ్యానికి, మానవశక్తికి దోహదంగా వుంటుంది. దేశంలో ఈనాడు ఇంకా అశాంతి చెలరేగుతోంది అంటే అది మానవునిలోపం. ప్రభుత్వం ఎన్నిశాసనాలు పెట్టి దేశాన్ని బాగుచెయ్యకలదు? పెద్ద పెద్ద నాయకులు వారి అమూల్యమైన బుద్ధిబలం వల్ల, దేశాన్ని స్వతంత్రంగా ఈనాడు నిలబెట్టారంటే, అది, వారు కష్టపడి సంపాదించిన సుఖానుభూతి. ఆ అనుభూతిని తలచుకుని మనం, మనం ఇప్పటికీ తృప్తిచెందుతున్నామంటే ప్రతీమానవుని స్వతంత్రానుభూతి ఇంకా ఎంత ఆనందం ఇస్తుందో ఊహించలేము.

---



---

# మల్లిక



ఈ కథ చెప్పఁబోవఁగ స్రవించును బాష్పము లేక ధారగా
నా కనుదోయినుండి; యిక నాదగునీరవ కంఠమేమియున్
బైకి వచింపలే; దెటులొ వ్రాయఁగలేకయె వ్రాయుచున్న యీ
నాకలమే రచించు నొక నాతి విషాదకథా విధానమున్.

ఆమె మల్లిక; కించిదభ్యస్త విద్య; ద్రవిణహీన కుటుంబ సంభవ; నిరంత
రాత్మ భర్తృసంప్రీణనాయత్త చిత్త; బహుళ సుందర సంతానవతి; గుణవతి.

వసతి కుటీరవాటి; నిజభర్త నిరక్షరకుక్షి; సర్వదు
ర్వ్యసనపరుం; డకారణరుషాన్విత మూర్ఖమనః ప్రవృత్తి; యా
త్మసుతులు పిన్నవార; లిక మాయని నిర్ధనతాస్థితుల్; మదిన్
విసువువహింపకే యనుభవించును మల్లిక యెల్ల కష్టముల్.

మల్లికకుఁ గవిత్వమల్లుట యలవాటు పడినదెట్లొ పిన్నవయసునందె;
చదువకున్ననేమి శాస్త్రాలు; పూర్వసంస్కార వాసనావశంవదులకు!

తన వ్రాతలెల్ల చేతనవ్రాతములకు దైవమునందు భక్తిభావము ఘటింప
తన వర్ణనములద్యతన వర్ణ మతభేదమును రోసి సకలైక్యతను వచింప
తన గీతము వినిసంతసగీతదాఁటక ధనవంతులు నిఱుపేదను గనంగ
తన కవిత్వము పురాతన కవిత్వమునకు వెలలేని మెఱుఁగులు వెలయఁజేయ

దీరుబడివేళ యావేశపూరితమగు సమయమున నేదియో వ్రాసి చదువుకొనుచు
గడపుకొను నామె జీవితకాలమెల్ల; తన హృదీశున కివియెల్లఁ గనిన నీసు.

కాలమిటేఁగుచుండ నొకకాళనిశీథమునందుఁ దాళప
త్రాలను గంటమూని యెదొ వ్రాయుచు మల్లికయుండ మద్యమున్
గ్రోలుట నెఱ్ఱబారిన కనుల్ గడు నిప్పులు గ్రక్కుచుండగాఁ
దూలుచు భర్తగారు పని తొందరమై చనుదెంచి; రంతటన్.

తాను వచ్చి యట్టి కృత్యమ్ము దెలుప ముకుళితంబయ్యె మల్లిక ముఖకమలము;
రెండుమూఁడు దినమ్ముల నుండి యెటులొ తప్పినట్టి గండము నేడు తప్పదాయె!

"మంగళసూత్ర మిమ్మనుచు మాటికి నన్ బలవంతపెట్టి య
మ్మంగ, దలంచుచెంతటి యమంగళదాయక మార! మీకు నా
కుంగల ప్రేమ చిహ్నమును గూడ హరించుట యేటిపాడి? న
న్నుంగరుణించి నానుడివినుం; డిది యొక్కటి దక్కనీయుఁడీ !!"

అనుచుమల్లిక భక్తితో నతనిఁగాంచి పూర్వ విధముగ విన్నపమునొనరించె
వాఁగు లేకాని వినఁ బోఁడు త్రాగుబోతు; భ్రష్టునకు ధర్మవాగ్బోధ వ్యర్థముకద !!
సామవచనాలతోఁ బని సాగదగుట నను దిరస్కృతి సేతువా యని యఱచుచు
నాతఁ డుద్ధత క్రోధుఁడై యామెకొప్పు వట్టి యీడిచి పాపము కొట్టినాఁడు!

అతని కరఘాతములు కొన్ని యనుభవించి చేయునది లేక యామె మూర్ఛిలిపోయె!
వానిచేతులు చెక్కలై పోను; సరకుచేయఁ బోక మాంగళ్యము చేతఁ గొనియె.

అంతట నా దుర్మార్గుఁడు చెంతంగల మల్లికా రచిత గ్రంధములన్
సుంతయు వెనుదీయక బలవంతముగాఁ జించి పారవైచె నటునిటున్.

వికటాట్ట హాసముఖుఁడై చకచక మని యతఁడు పాన శాలకుసాఁగెన్
వికలమ్మగు మదిలో మల్లిక కొంచెము తెలివిఁజెంది లేచిన దెటులో.

గుండె నీరయిపోయె విభుండొనర్చినట్టి దారుణ కృత్యము నరసినంత;
తాళపత్ర భిన్నము లొకదరికి చేర్చి పాప! మాయమ విలపించె బాలవోలె.

అంతటినుండి యామెను హృదంతరమందు నిరంత చింతయుం
గొంత కృశింపఁ జేసినది; నోరును విప్పఁగ బోవ; దన్నమున్
సుంతయు ముట్టబోదు; గృహ శోభనశించి నశించి నాటకం
బంతము చెందునట్టి సమయమ్మరుదెంచెఁ గ్రమక్రమమ్ముగన్.

ఒక్క నిశినామె ప్రాణవాయువు లనంత వాయువున లీనమయ్యె; దీపమ్ములేని
యంధకార మధ్యమునుండి యఖిలదిశలు వ్యాప్తిచెందెను రోదనధ్వనులతోడ.

ఇంత జరిగిన నతఁడు దుర్వృత్తి మానుకొనుట గతజల సేతుబంధనము గాదె!
ఫలము లేదని మదిలోనఁ దెలిసికూడ మల్లికఁ దలంచి దను క్షమింపమను నంట !!

రానురా నేమియైనదోగాని యిప్పుడెవరు గూడ నచ్చట వసియింపఁ బోరు ;
రాత్రివేళలఁ దాళ పత్రాల పైన వ్రాయుచున్న శబ్దమ్ము విన్పడుట కద్దు.

వంగల పార్థసారథి ఆచార్యులు,

# భారతీయప్రతిభ

శ్రీమతి కొత్తపల్లి లలితగారు



ఏది భారతీయ ప్రతిభకు నిదర్శనమో ఎచ్చట భారతీయ ప్రతిభ గర్భితమై వున్నదో గ్రహించడం చాల కష్టం.

భారతీయ ప్రతిభను గ్రహించ దలచిన మనస్సునకు ఆత్మ స్వాతంత్ర్యము, స్వేచ్ఛ అత్యావశ్యకాలు. రాజకీయ వేత్తలు భారతదేశం యొక్క ఆర్థికాది స్వాతంత్ర్యములకై కృషిచేస్తున్నారు. ఇహలోక జీవనానికి అవి ముఖ్యమే, గాని బాహ్యస్వాతంత్ర్యాన్ని అంతస్స్వాతంత్ర్యాన్ని వేరుచేయలేము: గనుక సరిగా భారతీయ ప్రతిభను అర్థం చేసుకోవాలంటే ఆత్మ స్వాతంత్ర్యము వుండి తీరవలసినదే.

భారతీయ కళను గాని మతాన్ని గాని భారతీయమైన దేన్నిగాని అవగాహన చేసుకోవాలంటే ఆత్మ స్వాతంత్ర్యము వుండితీరవలసినదే.

భారతీయ కళను గాని మతాన్నిగాని భారతీయమైన దేన్నిగాని అవగాహన చేసుకోవాలంటే అంతః స్వాతంత్ర్యము లేకపోతే అది అగ్రాహ్యమవుతుంది.

భారతదేశంలో ఆసేతు శీతనగం ఎక్కడికి వెళ్లిచూచినా ప్రజలింకా అర్థంచేసుకోని - ఎంతో కళా సౌందర్యం కనబడుతూ వుంటుంది. దీనివిషయమై ప్రజలింకా అచేతనంగానే వున్నారు. భారతదేశంలో వున్న కళయొక్క ఆత్మ అజ్ఞాతంగా వుంది. మన పరిసరాల్లోవున్న సౌందర్యాన్నంతా జ్ఞాతంగాచేసి ప్రజాబాహుళ్యం ముందర పెట్టగల్గిన నాడు భారతీయ సంస్కృతికి పూర్ణమైన వ్యక్తీకరణ జరిగినట్లు.

ప్రతిభా విషయంలో మనకు అభావమేమాత్రంలేదు. మనం చేయవలసిన పని లేనిప్రతిభను సృష్టించడంగాదు. ఉన్నదాన్ని అభివ్యక్తం చేయడం. మనం యెదుటవున్న ప్రతిభను కళ్లు తెర్చిచూస్తే, భారతదేశంలో ఎక్కడపడ్తే అక్కడ-సంగీతంలో, రూపకంలో, చిత్రలేఖనంలో. ఇంతెందుకు, జనుల నిత్యజీవితంలో ఇంటింటా గోచరిస్తుంది. ఇప్పుడు భారతదేశంలో నిజంగా భారతీయమైనది ఏదీలేదంటే ఆశ్చర్య పడనక్కరలేదు. పూర్ణమైన భారతీయ నాగరికతను ప్రజలు అర్థం చేసుకొన్నప్పుడే భారతీయతను నిత్యజీవితంలో చూపగలరుగాని లేకపోతే చూపలేరు. నిజంగా భారతీయ శిల్పసౌందర్యాన్ని వాస్తువిన్యాసాన్ని చూడాలంటే పురాతన కాలంలోకి పోతేనేగాని భారతీయులమని గర్వపడను దగ్గరగా గానరావు.

నేటి పరిస్థితిల్లో భారతీయ నాగరికతకు సంస్కృతికి నిరోధకులు ఎవ్వరంటే చదువుకొన్నవారు అని అంటే ఆశ్చర్య పడనక్కరలేదు. పాశ్చాత్య విజ్ఞానాన్ని శాస్త్రీయ వైజ్ఞానిక చూపును గ్రహించడం అవశ్యకమేగానీ మన సంస్కృతితో మేళవించ లేకపోవడం విచారింప వలసిన విషయం, ఈ చదువుకొన్నవారిలో చాలామందికి మన దేశాన్ని గురించి మన ప్రతిభనుగూర్చి మన లోపాలను గూర్చి తెలియదు. తెలియక, వూరుకోక చదువుకొన్నవారు గనుక పాశ్చాత్య సులోచనాలతో భారతీయ నాగరికతను చూచి తృణీకరించడం వీరిలో వుంది. ఇది పోతేనేగాని ప్రాచ్య పాశ్చాత్య సమన్వయం కలిగి మన ప్రజ్ఞా విశేషములు పైకి రావడం జరగదు. మనదేశంలో విద్యావంతులకు మన నాగరికతను గూర్చి తెలియక పోవడానికి ముఖ్యకారణం నేటివిద్యాసంస్థలు. విద్యార్థుల విషయంలో ఏదిచదువుతే అదే. ఈ విద్యాసంస్థలలో

మన సంస్కృతిని తెలుసుకొనే అవకాశాలు చాలా తక్కువ. అందుచేతనే చదువుకీ జీవితానికీ మధ్య ఇప్పుడు కనబడే అగాథం చాలా విషయాల్లో 'చదువుకొన్న వానికంటే చాకలిమేలు' అన్న సామెతబాగా వర్తిస్తుందేమో!

విదేశాల్లో శాస్త్రం చదివినా సాహిత్యం చదివినా ఏదిచదివినా జీవితానికి దేశ సంస్కృతికి సంబంధము లేకుండా ప్రణాళికలు వారి విద్యాసంస్థలు ఏర్పర్చవు; గనుక ఎంతచెడినా పాశ్చాత్యుల దగ్గర మనం నేర్చుకో వలసిన పాఠాలు వుండకపోవు. ఈ సమన్వయ దృష్టిని సత్వరంగా అలవర్చుకోక పోతే, భారత దేశానికి ఏ ప్రత్యేకమైన నాగరికత అంటక 'రెంటికీ చెడిన రేవడి' అవును.

మన సంస్కృతిని మనం అర్థంచేసుకొని ఆచరణంలో పెట్టుటకు ముందు అజ్ఞాతంలో వున్న మన ప్రతిభావంతులను గౌరవించి పైకి తీసుకొని రావలెను. మనలో ప్రతిభకు లోపం లేదు. దాన్ని గ్రహించి మనలోని ప్రజ్ఞాశాలుల్ని అభిమానించే ప్రజ కొరవడటంచేత మన ప్రతిభ విశ్వజనీనం కాలేదు. మన వేత్తలను ఇతరులు చూచి గౌరవించినప్పుడే మనం వాళ్ళను గౌరవించడము మన కలవాటుగాని ఇతడు 'ప్రతిభావంతుడు' అని ముందు మనం గౌరవించి ఇతరులకు చూపడం మనలో లేదంటే సాహసం కాదు. ఇప్పుడు కావలసింది అది.

# నా చెలి



వి. రాధాకృష్ణమూర్తిగారు బి. ఎస్‌సి.

మునుపొకనాడు దూరమునపొంచి లతాంగినిఁజూచినప్డు నా
కనులకు హాయిఁగొల్ప పొడకట్టిన సుందర దృశ్యమట్లుగా
మనమునతోఁచెఁ; నొక్కక్షణ మాత్రమె నాకటు భాగ్యమబ్బె ; న
య్యనుభవ మేరికిన్ తెలుపుటన్న నశక్య మదంత యూహ్యమౌ.

కులుకు నడకలు, ఒయ్యారి బెళుకుచూపు
అందచందము కనుగొన్న అతివమిన్న
శివతపోవిఘ్నకారుడౌ పువులవిల్తు
తో వెడలినట్టి యారతీదేవి బోలు.

కాపురముచేయవచ్చిన కలికి జూడ
అమరభామిని యయ్యె గృహంబునందు
స్వచ్ఛగృహిణియై కన్పట్టు భర్తకష్ట
సుఖములను పంచుకొనుటయె సుఖమటంచు.

వనజముఖి ముఖమును కనుగొనిన యపుడు
మధురమౌ నూహ లెన్నియో మదికిదోఁచు
మునుపుగనిన కలల్ నిజమనుచు దోఁచు
జీవితము సుఖమయమని చింతసేతు.

క్షణికపు దుఃఖముల్ చెలువ కన్పడజేయు నొకొక్కసారి; యా
ప్రణయపు కోపమన్నది యమాయకమౌ నొకపన్నిదంబు; మ
త్ప్రణయిని నప్డు ముద్దుగొని ఫక్కున నవ్వుచు ప్రక్కజేరి, త
క్షణమె క్షణాలచేయును యుగంబుల, నెట్లొ, అపూర్వవైఖరిన్.

అంతియెకాదు ఆచెలువ అద్భుతశక్తులు, దీర్ఘదృష్టియున్
శాంతము బుద్ధి సూక్ష్మతయు, శక్తి, యుపాయము గల్గి నాకు నా
ద్యంతము మార్గదర్శినియునై సుఖవంతముజేయు జీవితం
బంతయు; దైవభామయె, నరాంగనయో అనుమానమయ్యెడిన్.

కవితల్లనేర్చిన తొలినాళ్లలో వీరివ్రాసిన కులాసాగా వ్రాయగా నీ శతకములుగా నమరినవి. శ్రీ శారదాంబగారు నర్మోక్తియందు కుశలురు. అది శారదాపతిశతకమునను, ఆమె ఇతర రచనలయందును గోచరమగును. ఆమె "సామాన్యముగ తనుగొల్చు ఇష్టదైవమును గురించి లోపముల నిట్లు ఆన్యాపదేశములుగానో తనకే యారోపించుకొనియో నిందాస్తుతులుగా వెల్లడించుచుండు"నని లక్ష్మీకాంతమ్మగారందురు. కవిత్వతత్వమందును ఇదియొక రమ్యమగు పోకడ.

## లక్ష్మీ శారదా సుభాషితములు

శ్రీ శారదాంబగారు అన్నగారివద్దనుండి భర్తవద్దకు విశాఖపట్నమునకు వెళ్లిన పిదప ఒండొరులకు నీతులుపదేశించుకొనుచు లేఖలు వ్రాసుకొనగా అవి 200 పద్యములై ఈ సుభాషితములనే గ్రంథముగ రూపెత్తినవి. నిత్యజీవితమున గృహస్థుల నెదుర్కొను అనేక సమస్యలను సులభముగా గడచి సుఖముగా జీవించుటకు నీతివంతమగు నుపాయము లిందు పొందుపరుపబడినవి. ఆయాపద్యములకు తాత్పర్యమును ఇందు చేర్చబడినది.

## ఆరోగ్య సామ్రాజ్యము

గృహములందు ఇల్లాండ్రు గమనింపవలసిన ఆరోగ్య విధులను వివరించుచు బొబ్బిలిపాటవలె జంగము కథగా నిది రచింపబడినది.

## పితృస్మృతి

శ్రీరామమూర్తిపంతులుగారి తండ్రిగారు శ్రీ నరసింహంపంతులుగారు. ఈయన భార్య 1911 ప్రాంతంలో స్వర్గస్థురాలైనది. ఆడు, మగ సంతానమున కాయనయే తల్లియు తండ్రియునై "స్వల్పవేతనముతో నల్పసంతోషి"యై, పడరానిపాట్లుపడుచు సంసారసాగర మీదినాడు. 1920 ప్రాంతానికి కాపురమునకు వచ్చిన పెద్దకోడలు లక్ష్మీకాంతమ్మగారికి గృహకృత్యము నప్పజెప్పి తన కుమార్తెలనుమాదిరిగానే మన్నించి గౌరవించినాడు. 1931 లో ఆయన దివంగతులుగాగా కూతురు శారదమ్మతోపాటు కోడలున్నూ ఈ "పితృస్మృతి" వ్రాసినది. శ్రీ నరసింహంగారి కరుణామయ జీవితమును కళ్లకు కట్టినట్లు వీరు వర్ణించినారు.

## మానస సామ్రాజ్యము

"మనసా ... ... ... మానసిక సామ్రాజ్యంబు నీవొందుమా" అన్న అంత్యముతో 39 పద్యములుగల చిన్నగ్రంథమిది. చుక్కలున్నచోట, ఒక్కొక్క పద్యమున "లక్ష్యమునిల్పి" "చింతనువీడి" "నిల్కడబూని" "భీతినివీడి" "ఆశలవీడి" ఇత్యాది హెచ్చరికలతో మానసబోధ జరుపబడినది.

## కుమారీ నీతి

ఏడ్గురు కుమార్తెలకు తల్లియైన లక్ష్మీకాంతమ్మగారు వారినత్తవారిండ్ల కంపునపుడు గృహిణీధర్మబోధను జీవయాత్రకుపాథేయముగా నొసంగి పంపుటకై రచింపబడిన దీపద్యకావ్యము. అట్టితల్లులందరు ఉపయోగింపదగినది.

## శతకరామాయణము

పిసిపాటి సోమయ్యగారు రచించినదిది. ఈ గ్రంథములలో చతుర్థపుష్పముగా నంగీకరింపబడి ప్రచురింపబడినది.

## లేఖదూత

వీరు రచించిన కావ్యములలోకెల్ల 'లేఖదూత' ఉత్తమ కావ్యమని నామతము. శ్రీ రామమూర్తిగారు నూజవీడున ఉద్యోగము చేయుచుండగా అకారణముగా వారిని అనంతపురంజిల్లాలోని కదిరికి బదిలీచేసిరి. తిరిగీ త్వరలో సర్కారులకు మార్పించుకొనదలంచి కుటుంబము నిచ్చటనే విడిచి వారువెళ్లిరి. శ్రీరామమూర్తిగారికొక్క వియోగబాధయే. లక్ష్మీకాంతమ్మ గారికో, వియోగబాధతోపాటు కుటుంబనిర్వహణ భారముకూడ. కుమార్తెలలో సీతామహాలక్ష్మి చదువుకొనుచున్నది. కనకమ్మయు చెల్లాయియు ఆడుచుపాడుచు కాలముబుచ్చు వయస్సువారు. భారతి "పల్కుపల్కున తేనెలొల్కబలుకుచు" చిటిపొటి అల్లరు లొనర్చుచున్న చిన్నబాలిక. సావిత్రిఅప్పుడప్పుడే ప్రాకుచున్నది. శ్రీనివాసులున్నూ రామున్నూ విద్యార్థులు; తండ్రిలేని సమయమున తల్లినే పాఠములు చెప్పుమని ఇంటిపనులమధ్య వెంటాడుచున్నవారు. అయినను నాటి తన అవస్థ ఇట్లని మనోహరముగ వర్ణించుకొన్న దామె.

"పిల్లలకోడినౌట, తెరపించుకలేదిక, నేమిసేతు? నే
నిల్లును దిద్దుకొంచు, నొక యించుక తెన్నొకటబ్బనేని, నే
నుల్లసమొంది, యత్తఱిని నోపికదెచ్చుక కొన్నిపద్యముల్
జల్లగ వ్రాయజూతుసుము! చారుగుణాకర శ్రీ మనోహరా!

ఒకతఱి శ్రీనివాసునకు నొప్పగపాఠము జెప్పుకొంచు నే
నొకపరి నాదు సాయితిని నూయలలోనిడి జోలపాడగా,
నొకపరి నాయనుంగుసుత లుద్ధతి నల్లరి చేయుచుండ నా
కిక తెరపిట్టులుగల్గనగు; ఇట్టులె కాలము తర్లిపోయెడున్.

కండలు విప్పనట్టి కసుగాయల, నీదగు చిన్నిపాపలన్
బండతనంబు నుంచకను పాఠములన్ బఠియింపజేసి నా
యండను జేర్చుకొంచు, కడునాదరభావ సమన్వితంబుగన్
బుండరికాక్ష! చూచుకొని పొంగుచునుందు ననేకభంగులన్."

ఇట్టితల్లికదా గృహాలంకారము! ఇట్టిగృహిణికదా గృహదీపము!! ఇట్టిగృహలక్ష్మికదా ఆదర్శగృహలక్ష్మి!!!

## వరకట్న నిరసనము

శ్రీరామమూర్తిగారి సోదరులు శ్రీ గోపాలముగారు. ఆమె కుమార్తె చి॥ నరసాంబను శ్రీ కాకుళమున నున్న నిడమర్తి ఈశ్వరప్పగారికుమారుడు బసవరాజునకిచ్చి వివాహమొనర్ప నిర్ణయింపబడినది. లక్ష్మీకాంతమ్మయు ఈమెభర్త రామమూర్తిగారును పెళ్లిపెద్దలు. నిడమర్తివారు కట్నమపేక్షించిరట! కాగలవియ్యపురాలగు శ్రీమతి అలక రాజేశ్వరి గారితో లక్ష్మీకాంతమ్మగారు కట్నము నేవగించుచు ఉత్తరప్రత్యుత్తరముల నడిపిరి. వియ్యపురాండ్రును, వియ్యంకులును పెండ్లికుమార్తెయు అందరును కవితావిశారదులే. వియ్యపురాళ్ల సరసాలతో, నియ్యోగపునీటుతో, పరస్పరాను రాగవల్లికలతో ఈలేఖలెంతో హృద్యముముగనున్నవి.

## అముద్రితగ్రంథములు

ఇంకను ఈమె వ్రాసిన అముద్రితగ్రంథములు, తిరుపతి వేంకటేశ్వరశతకము, రామచంద్రశతకము, కన్నీరు మున్నగునవియున్నవి. అడపదడపా బంధుమిత్రులకు లేఖలలోను, ఊసుపోకకు వేడుకగాను, తాత్కాలికప్రయోజనకరముగ పత్రికలలోను వ్రాసిన పద్యములెన్నియో యున్నవి. వాటన్నిటిని చేర్చి కూర్చినచో మంచి చాటు పద్యరత్నాకరమగును.

వీనిలో "కన్నీరు" భర్తృవియోగానంతరము తొలిరోజులలో దుఃఖసాగరమున మునిగి తేలుచు శ్రీ లక్ష్మీకాంతమ్మగారొక్కరు వ్రాసిన పద్యములు కరుణారస ముట్టిపడుచున్నవి. ఇట్టి బంధువియోగ దుఃఖము ఆత్మీయము. కాళిదాసాదికవులు ఇతరుల దుఃఖమును (రతీవిలాపాదులు) హృదయవిదారకముగ వర్ణించి సహృదయుల హృదయముల పిండివైచినారు. వడ్డాది సుబ్బరాయకవి, మధురకవి నాళం కృష్ణారావు ప్రభృతులు - ఆత్మీయదుఃఖాశ్రువులను కరుణారస ప్రవాహములుగ జేసి రసజ్ఞుల హృదయములను కోతకోసినారు. శ్రీ లక్ష్మీకాంతమ్మగారి "కన్నీరు" అనుకృతి అట్టిదిగా నాకు తోచినది.

## దివంగతుడు రామలింగారెడ్డి

ఆధునిక కాలమున ఆంధ్రజాతి సంభవమగు అమూల్యరత్నము కట్టమంచి రామలింగారెడ్డిగారు దివంగతులైనారు. ప్రాచ్యపాశ్చాత్యవిద్యానిధి, విద్యాబోధనావిధానవేత్త, ఆంధ్రభాషావేది, కవి, విమర్శకుడు, వాగ్మి, సంభాషణాచతురుడు, రాజనీతిజ్ఞుడు: ఇట్లు బహుముఖ ప్రజ్ఞావంతుడై 71సం॥లు జీవించి ఆంధ్రదేశమునకు వెలలేని కీర్తిని సంపాదించి కీర్తిశేషుడైనాడు రెడ్డి.

చిన్ననాటనే, విద్యార్థిగానే, ఆంగ్లదేశమున ఆంగ్లవిద్వద్బృందమునకున్నూ సంభ్రమాశ్చర్యముల చేకూర్చి వారి ప్రశంసలనంది, గొప్ప ఆశల చిగుర్పచేసిన రెడ్డి అధికస్థానములనందియు, ఆంధ్రరంగమునగాని, భారత రంగమునగాని, అగ్రస్థానము నలంకరింప లేదేయని ఆంధ్రులకు చిరకాలము నుండి కొరత. ఆ కొరత తీరకయే గతించినాడాయన.

అర్థశాస్త్రమున నతడు "ప్రియసఖి" స్మృతిగా పొందుపరచిన పద్య సంపుటి, ఆతని కవిత్వపు సొంపునేగాక ఆమెయెడ అతనికిగల ప్రేమానురాగ కృతజ్ఞతల పెంపునున్నూ వెల్లడించుచున్నవి. ఇందుకు సహృదయు లెల్లరు ఆమరణాంత మవివాహితుడైయుండిన వీరి త్యాగమయ జీవితమును దలంచి యొక నిట్టూర్పు విడువకమానరు. అదియే ఆతని కాలోకమున ఓదార్పు, ఆత్మశాంతి ప్రదాయిని.

స్టార్ ఆఫ్ ఇండియా పెన్సిళ్లకై

# మద్రాసు పెన్సిల్ ఫ్యాక్టరీ



ఉత్తమ తరగతి అచ్చుపనులకు, లితో ప్రింటింగుకు

# హో అండ్ కంపెనీ



అన్ని రకముల స్టేషనరీ పరికరములకు

# వి. పెరుమాళ్ చెట్టి & సన్సు

సంప్రదించండి

---

## వి. పెరుమాళ్ చెట్టి & సన్సు

3, స్ప్రింగర్ వీధి, :: మద్రాసు-1.

(154-వ పుట తరువాయి)

తొలుత గా చి॥ కాంతా వసంతకుమారీగార్లు ప్రార్థన గావించిరి. తరువాత వెంకటప్పగారు కంకణ గృహీతను, అధ్యక్షురాలిని ఉత్సవవేదికపై కాహ్వానించుచు వారిని సభవారికి ఉచితవాక్యముల నెరుకపరచిరి.

అంత వారుభయులు వేదికపైకి విచ్చేయగా పుష్పమాలాలంకృతు లొనర్పబడిరి. తదుపరి అధ్యక్షురాలు శ్రీమతి చన్నఘంటమ్మగారు యథోచిత వాక్యముల కంకణగృహీతలగు శ్రీమతి లక్ష్మీకాంతమ్మగారిని, కంకణప్రదాతలగు శ్రీ కేసరిగారిని ప్రశంసించి తమకీ యవకాశ మొసగినందులకు వారికి తమ కృతజ్ఞత తెల్పి సభాప్రారంభ మొనర్చిరి.

అంత శ్రీ కేసరిగారు బలహీనముగనున్నను ఉత్సాహము పెంపున సభాసదుల కిట్లని గంభీరముగ విన్నవించిరి:

మహాశయులారా! ఈసమయమున నేను కొన్నిమాటలు చెప్పుట ఆచారము. కాని అనారోగ్యముచే ఉపన్యసింపజాలకున్నాను. అయితే నాకుతోచిన మాటలను వ్రాసియుంచితిని. వానిని నాతరఫున మా అమ్మాయి చదువును; మన్నింపుడు.

అప్పుడు శ్రీమతి ములుకుట్ల సుశీలగారు కేసరిగారి ఉపన్యాసమును సభాసదులకు చదివి వినిపించిరి. శ్రీ కేసరిగారందు పొందుపరచిన ఉదాత్తభావములకు సభవారు హర్షధ్వను లొనర్చి తమ సంతసమును వెల్లడించిరి. (ఈ యుపన్యాసము ప్రధానవ్యాసముగా పొందుపరుపబడినది.)

అంతట శ్రీ కేసరిగారెట్లో ఓపికచేసుకొని లేచినిల్చి సగౌరవముగ శ్రీమతి గిడుగు లక్ష్మీకాంతమ్మగారి కరకమలములందు అందమగు పేటికయందు భద్రమొనర్చబడియున్న స్వర్ణకంకణము నర్పించిరి. ఆమె దానిని అధ్యక్షురాలి కందివ్వగా ఆనారీమణి కంకణమును కవయిత్రి ముంజేతి కలంకరించెను.

తదుపరి శ్రీమతి లక్ష్మీకాంతమ్మగారు కంకణప్రదాతకు తన కృతజ్ఞతను వెల్లడించుచు, సభాసదులకు గంభీరోపన్యాసమున తన్పిరి. ఇది వేరొకచో ముద్రింపబడినది.

తరువాత సభకురాజాలక పలువురంపిన సందేశములు సభవారికి విన్పింపబడినవి.

# సందేశములు

నెచ్చెలీమణి!

చాలా కాలమునకు మీ క్షేమవార్త వింటిని. మార్చి 2.వ తారీఖున "గృహలక్ష్మీ స్వర్ణకంకణము" మీకు సమర్పింపబోవుచున్నారని వింటి. చాలా ఆనందము. మీ ప్రాణేశ్వరుడు గిడుగురామమూర్తి గారు కవితాలోకంబున మీచే జయ పతాక మెత్తించవలయునని పలువిధంబుల ప్రయత్నించి సఫలీకృతులయిరి. వారి కృషి ఇప్పటికి ఫలించి దిగ్విజయమందినది. వారిప్పటికి జీవించియుండిన ఆనంద సాగరంబున నోలలాడి యుందురు. ఆ భాగ్యము పట్టకపోయెను. కాని వారి ఆశయమును విడువక కృషిచేసి పూరించిన మీ ప్రజ్ఞ ప్రశస్తనీయము. ఇప్పటికైనా కీ॥ శే॥ రామమూర్తిగారు సూక్ష్మశరీరంబున మీ యండనుండి, మిమ్ముల దీవించక మానరు. వారి ఆత్మతేజస్సు మిమ్ముల రక్షించుగాక.

చేబ్రోలు సరస్వతీదేవి

♦ ♦ ♦ ♦

గృహలక్ష్మీ స్వర్ణకంకణ సత్కార మీ వర్షము శ్రీమతి గిడుగు లక్ష్మీకాంతమ్మగారికి జరుగుట ముదావహము. లక్ష్మీకాంతమ్మగారి రచనలు పెక్కు గాంచితిని. వారి లక్ష్మీశారదాశతకము, లక్ష్మీశారదా సుభాషితములు మిక్కిలి కొనియాడదగియున్నవి. సుభాషితములు, భర్తృహరి సుభాషితములవలె నీతిపూరితములై

జనాదరణమును బొందినవి. శ్రీమతి శారదాంబగారును లక్ష్మీకాంతమ్మగారును గలసి భాషాసేవ చేయుచుండెడివారు. ఆంధ్ర స్త్రీల దురదృష్టముననో, యాంధ్రభాషాదురదృష్టముననో శ్రీ శారదాంబగారు గతించిరి. అయినను లక్ష్మీకాంతమ్మగారు భాషాయోషను తమ అమూల్య రచనలచే నలంకరించుచు స్త్రీలకాదర్శప్రాయులుగనున్నారు. శ్రీకేసరిగారు లక్ష్మీకాంతమ్మగారి వైదుష్యమును గుర్తించి కంకణ ప్రదానముచే గౌరవించుట నా హృదయము నానంద పూరితమొనర్చినది. కంకణ ప్రదాతను గృహీతను పరమేశ్వరుడు ఆయురారోగ్యముల నొసంగి రక్షించుగాక. గృహలక్ష్మి ప్రతివర్షమిట్టే జన్మవాసరముల జరుపుకొనుచు స్త్రీలోకము నుద్ధరించుగాక.

దేశిరాజు భారతీదేవి

♦ ♦ ♦ ♦

ఈ సంవత్సరము 'గృహలక్ష్మి స్వర్ణకంకణము' శ్రీమతి గిడుగు లక్ష్మీకాంతమ్మగారి కొసంగుటత్యంతానందకరము. శ్రీమతి లక్ష్మీకాంతమ్మగారుత్తమకవయిత్రీమణులలో నొకరు. ఆమె రచించిన గద్యపద్యములచే 'గృహలక్ష్మి' ఎల్లప్పుడలంకరించుకొనుటందరెరింగిన విషయమే. ఆమెకవితా శైలి కదళీపాకమై చదువరుల కుల్లాసము కలిగించుచుండును. కంకణ గృహీతయగు లక్ష్మీకాంతమ్మగారికి నా హృదయపూర్వకాభివందనములను అందజేయుచు, స్వర్ణకంకణ ప్రదాతయగు శ్రీకేసరిగారికి నా నమస్కృతు లర్పించుచున్నాను. 'గృహలక్ష్మి' చిరకాలమిట్లభివృద్ధి నొందుగాత!

దేశిరాజు జయలక్ష్మి

♦ ♦ ♦ ♦

మీరంపిన 'ఆహ్వానం' యీ రోజుననే అందినది. గృహలక్ష్మి జయంత్యుత్సవము అతిజయప్రదముగ జరుగ ఆశించుచున్నాను. కంకణ ప్రదాతనూ, గృహీతనూ శ్రీ పరమేశ్వరి ఆయురారోగ్య ఐశ్వర్యముల నిచ్చి, నిరంతరము బ్రోవ ప్రార్థించుచున్నాను.

స్థానాపతి రుక్మిణమ్మ.

♦ ♦ ♦ ♦

తాము పంపిన శ్రీ గృహలక్ష్మి జయంత్యుత్సవ పత్రిక చేరినది. చాలా సంతసించితిని. పాము కుబుస మూడ్చినట్లే భౌతిక దేహమును విసర్జించి చిన్మయస్వరూపులై ప్రకాశించుచున్న భగవాన్ శ్రీ రమణుల అనుగ్రహమువలన జయంత్యుత్సవము జయప్రదముగ జరుగునుగాక. శ్రీ గృహలక్ష్మి పత్రిక అనేక వర్షములు మహిళాసేవ చేయునుగాక. కంకణ గృహీతలకు నా అభివందనములు.

సూరినాగమ్మ. రమణాశ్రమం.

♦ ♦ ♦ ♦

త్యాగాసేవాసక్త, గాన కళావిశారద, విద్యాసుందరి.
శ్రీమతి బెంగుళూరి నాగరత్నంగారు.
శ్రీమతి లక్ష్మీకాంతమ్మగారికొనర్చు కంకణ ప్రదానోత్సవమునకు నాఅభివందనములు (తంతి)
అసోసియేటెడ్ అడ్వర్టైజరు & సర్వీస్, మద్రాసు

♦ ♦ ♦ ♦

మీ ఆహ్వానమందినది. పనితొందరచే రాజాలకున్నాము. క్షమించుడు. గృహలక్ష్మి పెంపొందుగాక. మీకు మాతోడ్పాటు ఎల్లప్పుడుకలదు.

మీ ఆహ్వానమునకు కృతజ్ఞుడను. గ్రామాంతరమునకు వెళ్లుచున్నానుగాన రాజాలకున్నాను. ఉత్సవము జయప్రదమగుగాకయని ఆశించుచున్నాను.

టి. యస్. సుందరం.

♦ ♦ ♦ ♦

గృహలక్ష్మి జయంత్యుత్సవములు జయప్రదముగా కొనసాగుగాక (తంతి)

—కోట లక్ష్మీకాంతం.

ఆ తర్వాత కవయిత్రులు, కవికుమారులు పంపిన పద్యరత్నములను శతావధానులు కవిచంద్రులునైన కోట సోదరకవులలో చిన్నవారైన శ్రీ కోట సత్యరంగయ్యశాస్త్రిగారు లఘువ్యాఖ్యానములతో కల్పి కడు శ్రావ్యముగ చదివి వినిపించిరి.

ఆ వెంట శ్రీమతి యం. యస్. సీతాదేవిగారు (ఈమె తెలుగున స్వేచ్ఛ కవితల్లుచున్న తమిళ యువతి; ఈమె చరిత్ర గృహలక్ష్మియందు 1950 నవంబరు సంచికలో ప్రకటింపబడినది.) ఇట్లుపన్యసించిరి:

"శ్రీ కేసరిగారు ఏటేటా విద్యావతులైన గృహలక్ష్ములకు స్వర్ణకంకణము ఇచ్చుచుండుట అందరూ ఎఱిగియున్న సంగతే. ఈ సారి స్వర్ణకంకణ బహుమతిని స్వీకరించేవారు శ్రీమతి గిడుగు లక్ష్మీకాంతమ్మగారు; అధ్యక్షురాలు శ్రీమతి అన్నాప్రగడ చన్నఘంటమ్మగారు. ఈమె ఆంధ్రమహిళాసభలో స్త్రీల అభివృద్ధికి కృషి చేయుచుండుటచే అందఱికిన్నీ పరిచితురాలే.

కేసరిగారిని ఎఱుగనివారు మదరాసులోనూ, తెనుగుదేశంలోనూ ఉండరు. ఈయన తయారుచేసిన మందులలో లోధ్ర స్త్రీలపాలిటి వరప్రసాదముగా పనిచేయుచున్నది. ఈయన సులభశైలితో నడుపుచున్న గృహలక్ష్మి పత్రిక గృహలక్ష్ములకు ఈడులేని సాహిత్యసేవ చేయుచున్నది. పైగా ప్రస్తుతం ఎక్కడా అమలులో లేని స్వర్ణకంకణ ప్రదానమును విదుషీమణులకిచ్చుటను చాల కాలంగా కొనసాగించుచున్నారు. అందుచేత ఈయనను గూర్చి నేను క్రొత్తగా ఏమీ చెప్పలేను.

ఈ సంవత్సరం స్వర్ణకంకణ గృహీతయగు శ్రీమతి లక్ష్మీకాంతమ్మగారిని గూర్చి కొంత ముచ్చటించు పని నాకప్ప చెప్పియున్నారు. ఇది నా భాగ్యమే.

శ్రీమతి లక్ష్మీకాంతమ్మగారు తెనుగు వాఙ్మయమందు దిట్టమైన పరిచయం కలవారు. భర్తగారి సహకారంవల్ల ఈమె సర్వలక్షణ లక్షితంగా కవితలు చెప్పడం అలవరుచుకొని తన విద్యను సార్థక పఱచుకొన్నారు. ఈమెది గొప్పకుటుంబం. పది మంది పిల్లలను పెంచి పెద్దచేసి ఇంటిగొడవలు కనిపెట్టుతూ కాలం సరిపుచ్చడమే మన ఇల్లాండ్రకు అతిప్రయాస అవుతుంది. మధ్య రోగం రొష్టూ, ఉంటవి. కలిమి, లేములు కూడ వచ్చి చిక్కులు కలగడం కూడ కద్దు. ఇట్టి కుటుంబ వాతావరణములో తిరుగుచుండు సతి తన కర్తవ్యములను చక్కగ నెఱవేర్చుకొని రసవంతములగు కవితలు వ్రాయడం ఈమెయొక్క పాండిత్యమును విద్యయందుగల ఆసక్తిని వెలిబుచ్చుచున్నది.

ఈమె వ్రాసిన 'లేఖదూత' మనస్సును ఆకర్షించునట్లు అమరినది. మేఘదూతవలె పెక్కు సందేశ గ్రంథములు ఉన్నవి కాని అవి ఆకాలమున కవిత చేయవలెనన్న సంకల్పంతో వ్రాయబడినవి. అవి సామాన్య విద్యావంతులకు అర్థంకానివి కూడా. ఈ లేఖదూత అట్లుకాక, మన సమకాలికులై మనకెట్టెదుట మసలుచున్న దంపతులు వ్రాసుకొన్నది. గ్రంథకర్త్రియే నాయిక; శుభాంతంగాముగిసే ఈ చిన్న కావ్యము లోకమునకు ఆదర్శప్రాయంగాఉన్నది. శైలి సులభం. విషయములు అన్నికుటుంబములలో కనుపించేవే. స్వాభావికంగా,

ఉన్నవి ఉన్నట్లు ప్రేమమయములైన దంపతులు వ్రాసికొన్నారు. భర్తను దూరదేశంలోకి బదిలీచెయ్యడం ఎడబాటును ఓర్వక ఉభయులున్నూ పద్యరూపంగా ఉత్తరములు వ్రాసుకోడం; ఇవన్నీ క్రొత్తదారిగానే ఉంది. భర్త ఒంటరిగా ఉండలేక దైవమును, విధిని, శనిగ్రహమును తిట్టడంచూస్తే మనుష్యుడెవడైనా ఈయనలాగే ఆ సందర్భంలో చేస్తాడని మనకు స్ఫురించును. ఆమె తనదుఃఖము దిగమ్రింగి భర్తను ఓదారుస్తూ వ్రాసేఘట్టం బలే జోరుగాఉన్నది. అయన వరుసగా బిడ్డల పేర్లుచెప్పి వాళ్లనుగురించి వివరాలు అడగడం, ఈమె తగినట్లు ప్రత్యుత్తరమివ్వడం అన్నీ తల్లిదండ్రుల అమూల్యప్రేమను విశదపరచుచున్నవి.

ఈమె తన బంధువుల పిల్లలిద్దఱికి సంబంధం కుదుర్చుటయు, వరశుల్కం తీసికోరాదని వియ్యపురాలితో తర్కించుటయు, ఈమె కార్య నిర్వహణశక్తిని వేనోళ్ల చాటించుచున్నది. భార్యభర్తలూ, మఱిదలూ కాక ఈ పెళ్లికి సంబంధించిన వారున్నూ కవిత్వంమూలంగానే ఈమెతో పెళ్లిమాటలు జరపడం చదివితే ఎంతో సరదాగా ఉన్నది. ఈమె వ్రాసిన మానసిక సామ్రాజ్యము ఆధ్యాత్మిక బోధ చేస్తున్నది.

ఈమె మఱదలూ ఈమెయు కలిసి వ్రాసిన లక్ష్మీశారదా సుభాషితము, లోకనీతిని ఉదాహరణములతో బోధించునది. లక్ష్మీశారదాకుమారీ నీతి ఆడపిల్లలకు నీతిని బోధించుచున్నది. లక్ష్మీశారదాశతకములు భక్తిపూరితములు. చాటుపద్యములలో ఈశ్వరస్తుతి హాస్యరస పూరితమైనది. లక్ష్మీశారదాగీతములు సులభముగా చిన్నపిల్లలు, పెద్దలుకూడా ఇండ్లలో విశేషములు జరుగునప్పుడు పాడుకొనవచ్చును. అన్నింటికి వరుసలు, కొన్నింటికి స్వరతాళములు ఇచ్చియున్నారు. భజన, లాలి, పూజలపాటలు, మంగళహారతులు అన్నియూ ఉన్నవి.

ఈమె పాండిత్యమును గుర్తించి శ్రీ కేసరిగారు బహుమతి ఇవ్వడం గృహలక్ష్ములందఱికీ చేయు మర్యాదయే అనవచ్చును.

పూర్వం స్త్రీలలో కవితలు వ్రాశేవారు చాలామంది ఉండిరి. తమిళ భాషలో అవ్వయార్, ఆండాళ్ వంటి వారున్నూ, తెనుగులో రంగాజమ్మ, మొల్ల, ముద్దుపళనివంటి వారూ ఉండిరి. కాని ఆ కాలమందు కవులను కవయిత్రులను ప్రోత్సహించుటకు రాజులు, జమీందార్లు ఉండిరి. క్రమంగా స్త్రీ విద్య అణగద్రొక్కబడినది. కవుల నాదరించువారే అరుదైనారు.

నేటికి స్త్రీలకు స్వర్ణయుగము వచ్చినది. మాఱుమూలలగల పల్లెలకూ పత్రికలు, పాఠశాలలు లబ్ధమైనవి.”

వారి తరువాత అఖిల భారత మహిళా మహాసభా గౌరవకార్యదర్శిని శ్రీమతి బి. కామేశ్వరమ్మగారిట్లు పన్యసించిరి:-

“పూజనీయులగు డాక్టరు కేసరిగారూ, సభాధ్యక్ష సభాసదులారా,

ఈ కంకణ ప్రదానం 20సం|| ల నుంచీ జరుగుతున్నా, ఇంతవరకు నాకు ఈ ఉత్సవమునకు వచ్చి పాల్గొనే అవకాశం కలుగలేదు. పత్రికలలో మాత్రం చూచి ఆనందించే దాన్ని. నేటికి ఈ అవకాశం కలిగింది కాబట్టి ప్రత్యక్షంగా ఆ ఆనందం అనుభవిస్తున్నాను.

కేసరిగారు ఈ మధ్య చాల అస్వస్థులుగా ఉంటున్నారు. అయినా వారు ఓపికతో ఈ ఉత్సవం స్వయంగా జరిపించటం, దానిని మనము చూచి ఆనందించడం మన అందరి అదృష్టం. వారికి బాగా ఆరోగ్యం చేకూరి వారిట్లే ప్రతిసంవత్సరమున్నూ ఈ కంకణ ప్రదానం చేస్తుండాలని కోరుతున్నాను.

కేసరిగారు: ఇన్ని సంవత్సరాలని లేదా యేమి?

కామే: కాదు; పుచ్చుకోవలసిన వాళ్లం ఇంకా చాలామందిమి ఉన్నాము.

కే: గతసంవత్సరపు మాతృపూజ ఈ సంవత్సరానికి ఫలించినది. ఈ సంవత్సరము మాతృపూజ వచ్చే సంవత్సరానికి ఫలిస్తుందిలే.

కా|| ఈ సంవత్సరము కంకణము తీసుకున్న లక్ష్మీకాంతమ్మ ఇందుకంతైనా అర్హురాలు. ఆమెను నాకు చిన్నప్పటినుంచి తెలుసు. అంటే మాకు 5, 6సంవత్సరముల ప్రాయంనుంచీ ఇద్దరమూ రాజమండ్రిలో ఆడుకున్నవాళ్లము. మాకు బంధువుకూడ ఆమె. పెద్దైనతర్వాతకూడ బంధువుల ఇండ్లలో పెండ్లిండ్లకు తరుచు కలుసుకుంటుండే వాండ్లము. చిన్నప్పుడు నేనూ ఆమెవలె సన్నగా పొడుగుగా ఉండాలనీ వంకులు వంకులు జుట్టుండవలెననీ అభిలాషగా ఉండేది; కాని సాధ్యమైంది కాదు.

ఆమె చిన్నప్పటినుంచీ చాలచురుకైనది; తెలివైనది. ఆమె వక్కలంకవారి ఆడపడుచు. వాళ్లమ్మపేరు చెల్లాయమ్మగారు. తండ్రి గవర్రాజుగారు. అన్న డాక్టరు కామరాజుగారు. మాతామహులు రాయువరపు వారు. వారింట్లోనేచిరకాలంచిలకమర్తి నరసింహంగారుండేవారు. అందుచేత ఆమెవిద్వాంసులమధ్య కవుల మధ్య పెరిగింది. ఆ సాంప్రదాయంలో పెరిగిన వారంతా ఇట్లాగే ప్రతిభావంతులైనారు. అసలు రాజమహేంద్రవరమే విద్వత్క్షేత్రము; కవిత్వానికి పుట్టిల్లు. కందుకూరి వీరేశలింగంగారు, చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు ఇట్లాంటి వారిస్వస్థలమైన రాజమండ్రిలో పుట్టి పెరిగితే కవిత్వంరాక తప్పదు. నాకూ వచ్చు, కవిత్వము వ్రాయడం: కాని తరుచు వ్రాయనందున అలవాటులేదు. ప్రయత్నంచేస్తే బాగానే వ్రాయగలను. రాజమండ్రితో సంబంధం గొప్పతనం కలిగిస్తుంది. తూర్పుగోదావరిజిల్లా చాలామంది గొప్పవాళ్లకు జన్మస్థానం. అట్టిచోట పుట్టిపెరిగి కవిత్వం వ్రాయనేర్చిన మా లక్ష్మీకాంతమ్మకు ఈ రోజున శ్రీ కేసరిగారు కంకణము ఇవ్వడం న్యాయం. నాకెంతో సంతోషకరం.

శ్రీ కేసరిగారిని నాకు చాలా రోజులనుంచి తెలియును. వారు మొదటినుంచీ అనేకవిధాల స్త్రీల అభివృద్ధికై పనిచేస్తున్నారు. వారు స్త్రీల ఆరోగ్యానికి లోధ్ర కనిపెట్టారు. దాని నమ్మి సంపాదించిన ధనం పెట్టి చాలమంది యువతులను చదివించారు; అనేకరకాలుగా స్త్రీ ఉద్యమాలకు ధనసహాయం చేస్తున్నారు. గృహలక్ష్మి పత్రికపెట్టి స్త్రీ రచయితలకు ప్రోత్సాహమిస్తున్నారు. రచనలో ప్రారంభకురాండ్రైనా, ఉత్తమరచనలు కాకపోయినా తిరుగగొట్టక ప్రచురించి ప్రోత్సహించి, వారు అభ్యాసంచేత ఉత్తమ రచయితలుగా తయారుకావడానికి తోడ్పడుతున్నారు. అట్లా ఉత్తమరచయిత్రైనవారికి ఒక్కొకరికి ఏటేటా స్వర్ణకంకణమునిచ్చి బహూకరించి ఈవిధంగా ఉత్సవాలు చేస్తున్నారు. ఈ రోజున నాకీసంగతులు చెప్పడానికి అవకాశమిచ్చిన శ్రీ కేసరిగారికి వందనములు. శ్రీ కేసరిగారికి ఇంకా ఆయురారోగ్యైశ్వర్యములుకల్గి ఇట్లే స్త్రీల అభివృద్ధికై పాటుపడుతూంటారని ఆశిస్తున్నాము.

అంత శ్రీమతి చన్నఘంటమ్మగారు తమ అంత్యోపన్యాసము నొసంగిరి. ఆమె ఆద్యంతోపన్యాసముల సంగ్రహమును వేరొకచో ప్రచురించితిమి.

సభాసదులకు, కంకణ గృహీతకు అధ్యక్షురాలికి వందన సమర్పణ మొనర్చుచు వెంకటప్పగారు కామేశ్వరమ్మగారన్నట్లు తూర్పుగోదావరిజిల్లా రాజమహేంద్రవరముల ఆధిక్యతను కాదననియు, గాని ఆ ఆధిక్యతను సాధించిన వారిలో కందుకూరి వీరేశలింగం, చిలకమర్తి లక్ష్మీనరసింహం, టంగుటూరి ప్రకాశం, ఇమ్మానేని హనుమంతురావు నాయుడు, డా. సుబ్రహ్మణ్యం, గంజాము వెంకటరత్నం పంతులు గార్లేకాక రాజరాజనరేంద్రుని ప్రధానామాత్యుడు వజ్జిత్రెగ్గడ సహా గుంటూరు జిల్లా ప్రాంతములనుండి వచ్చిన వారనే సంగతి మరువరాదనియు నేడు రాజమహేంద్రవరం కవయిత్రికి కంకణమిచుచ్చున్న శ్రీ కేసరి గారును గుంటూరి జిల్లావారేననియు కావున 'గుంటూరు గొప్ప' 'గోదావరిజిల్లా ఆధిక్యత'కు తోడైనప్పుడే ఆంధ్ర దేశంలో వ్యవహారములు తులతూగునట్లున్నదనియు చెప్పిరి.

అంతె యుత్సవము ముగిసినది. సభకువిచ్చేసిన పెద్దలొక్కరొక్కరుగా వచ్చి శ్రీ కేసరిగారినికుశల ప్రశ్నగావించి వారివద్ద శలవుగైకొని వెళ్లిరి.

# వరిఅన్నం గుండెజబ్బుకు మందట!

వరిబియ్యపు అన్నం రోగాలు కుదర్చడానికి అద్భుతంగా ఉపకరిస్తున్నదని అమెరికను డాక్టర్లు కనుక్కున్నారు. అమెరికాలో మూడోవంతుమంది గుండెపగిలి చచ్చిపోతూంటారు. ఆ దేశంలో జీవితం భయంకరమైన పోటీలతో కూడుకొని గందరగోళంగా ఉంటుంది. అందుచేత వారికి రక్తపుపోటు హెచ్చు; దాని ఫలితంగా గుండెజబ్బు అక్కడ ముఖ్యమైన రోగము. అక్కడొకచోట 18,000 రక్తపుపోటు రోగులకు వరిఅన్నం పెట్టగా వారిలో 1200 మందికి చాలా బాగా నయం కన్పించింది. కొంతమందికి రక్తపుపోటు మామూలుకు దిగిపోయింది. ఉబ్బిన గుండె కాయలు యథాస్థితికి వచ్చాయి. ఆ జబ్బువల్ల చూపు మందగించినవారికి చూపుకూడా వచ్చింది. డ్యూక్ విశ్వవిద్యాలయంలో వరిఅన్నంతినే చీనావాళ్లు మొదలైన ఆసియావాసులకు గుండెజబ్బు తరచు రాదేమిసుమా అని ఒక ప్రొఫెసరు యోచించి పరిశోధింపగా ఈ రహస్యం బయటపడింది. ఆయన ఈ రోగులకు రోజుకు నాలుగుసార్లు వరిఅన్నం ఒక చిన్నగిన్నెడు పెట్టేవాడు. దానితోకూడ పండ్లు, చక్కెర, బంగారపు సిరప్. (?) పండ్లు, పండ్లరసం కావలసినంత; వీటితోపాటు విటమిన్ మాత్రలుకూడ, రోగి తేరుకొనేకొద్దీ బంగాళాదుంపలు; టొమాటోలు, తేలికగా జీర్ణమయ్యే మాంసముకూడా. ఈ చికిత్సలోఉన్న చిక్కంతా ఏమంటే ఒకేరకమైన ఆహారం రోగులకు విసుగు పుట్టిస్తుంది!

# సంపాదకీయములు

## మద్రాసు క్రిస్టియన్ స్త్రీ కళాశాల.

మద్రాసు క్రిస్టియన్ కళాశాల యాజమాన్యమున నొక క్రొత్తవసతి గృహము ప్రారంభింపబడుట నభినందించుచున్నాము. ఈవసతిగృహ నిర్మాణమున కగు వ్యయమును అమెరికా స్త్రీలవద్ద చందాలుగా వసూలు చేయబడెనని ప్రిన్సిపాల్ టి డి. మేజర్ కన్య సగర్వముగా చెప్పుచున్నది. ఇట్లువారు ప్రాచ్య దేశములందలి 7 కళాశాలల కీనిధిని అర్పించియున్నారు. అందు 3 భారతదేశములోనున్నవి. మరి 3 చీనాలో నున్నవి; వేరొకటి జపానులోనున్నది. మరియు నీ కళాశాలపాలించు ఆదేశపు పరిపాలక వర్గములు తమ అధికారమును భారతదేశములోనే యున్న పరిపాలక వర్గమునకు విడిచిపెట్టిన వనుటయు శుభసూచకము. మంచి అభివృద్ధిలోనున్న ఈ క్రైస్తవ స్త్రీ కళాశాలవారు శాస్త్రవిద్యాశాఖకు అవసరమైన పరికరములను సమకూర్చుకొనుటకు రు 18,000 లను విరాళము కోరగా ప్రభుత్వమువారు ధనములేదని నిరాకరించిరట. స్త్రీవిద్యలో శాస్త్రబోధనా శాఖలు అభివృద్ధిగాంచినగాని వారు నిజముగా సంఘమున తమ ప్రత్యేక బాధ్యతలను నిర్వహింపజాలరు. కాన ప్రభుత్వమువారు ఈ విరాళమును నిరాకరించుటను మేము హర్షింపజాలము. ఈ సం॥ మున 60 కోట్లు వసూలుచేసి వెచ్చింప నుద్యమించిన ప్రభుత్వము స్త్రీల యున్నతవిద్య కాపాటి సాయము చేయజాలకుండుట హాస్యాస్పదము. నేడు మనరాష్ట్రమున మద్రాసు విశ్వ విద్యాలయావరణలో 12 స్త్రీల కళాశాలలున్నవనియు అందు 6000 మంది విద్యార్థినులు కళా శాల విద్య నభ్యసించుచున్నారనియు వైస్ ఛాన్సలర్ శ్రీ లక్ష్మణస్వామి మొదలియారుగారు చెప్పు చున్నారు. ఇదిచాల గొప్పగా భావింపరాదు, ఒక్క మద్రాసు నగరంలోనే కళాశాలలో 8000 మంది విద్యార్థులున్నారనియు చెప్పబడినది. దీనినిబట్టిచూడ స్త్రీలు ఉన్నతవిద్యయందెంత వెనుక బడియున్నారో తెలియగలదు. క్రొత్తరాజ్యాంగమున అన్నివ్యవహార రంగములలో స్త్రీ పురుష భేదము రద్దుచేయబడినది. వయోజనవోటింగుహక్కు ఇవ్వబడినది. జనాభాలెఖలలో పురుషులతో స్త్రీలును సంపాద్యపరులా, పరపోషకులా అన్నఆరా తీయబడుచున్నది. స్త్రీలును పురుషులతోపాటు అన్ని వ్యవహారరంగములలో సమముగా వర్తించుట కనువయిన పౌరధర్మము తెలియవలెనంటే, వారును సంపాద్యపరులై దేశీయార్థిక సంపత్తిని వృద్ధిపరచవలెనంటే, ముఖ్యముగా స్త్రీలుగా సంఘమున వారికిగల ప్రత్యేక బాధ్యతలను నిర్వ హించవలెనంటే, వారికిన్ని పురుషులతోపాటు కళాశాలవిద్య విరివిగా అందుబాటులో యుండవలెను. కావున మద్రాసువంటి నగరములలోనైన ఇకపై స్త్రీలకళాశాలలు వృద్ధికావలెననే శ్రీలక్ష్మణస్వామి మొదలియారుగారి కోరికను బలపరచుచున్నాము.

———o———

## శ్రీ వికృతినామ సం॥ర ఫాల్గుణ, ఖరనామ సం॥ర చైత్రమాసములు.

| | | | |
|---|---|---|---|
| మార్చి నెల | 16 | శు | అ 11.44 మృగ 6_39 రావి 0-6 |
| | 17 | శ | న 1.23 ఆర్ద్ర 12.55 రావి 15_52 |
| | 18 | ఆ | ద 21.1 పున 18_24 దివి 10-10 |
| | 19 | సో | ఏ 24.14 పుష్య 23_12 రాවి 27_13 |
| | 20 | మం | ద్వా 26.15 ఆశ్లే 9.44 రావి 28.1 |
| | 21 | బు | త్ర 27-15 మఘ 29_6 రావి 19.32 |
| | 22 | గు | చతు 26.12 పుబ్బ 30.11 రావి 18.13 |
| | 23 | శు | ○ పూర్ణి 25 1 ఉత్త 30.4 రావి 20.39 |
| | 24 | శ | కృష్ణ పా 22.13 హ 28-53 రావి 18_9 |
| | 25 | ఆ | వి 18.26 చిత్త 26-46 రావి 10_1 |
| | 26 | సో | త 13.51 స్వా 23_50 రావి 6-53 |
| | 27 | మం | చ 8.36 విశా 20_18 రావి 9-39 |
| | 28 | బు | పం 2.55 షష్టి 57.5 అనూ 16-22 రావి 21-27 |
| 1951 సం॥ | 29 | గు | సప్త 50-42 జ్యేష్ట 12.5 రావి 4.29 |
| | 30 | శు | అష్ట 44_51 మూల 8_59 దివి 4.14 |
| | 31 | శ | నవ 39 22 పూషాఢ 4.4 దివి 22-42 |
| | 1 | ఆ | దశ 34-22 శ్ర 55-28 దివి 5.31 |
| | 2 | సో | ఏ 30 9 ధని 55.15 దివి 7-7 |
| | 3 | మం | ద్వా 27—4 శతభిషం 54.13 దివి 13.2 |
| | 4 | బు | త్ర 24.5 పూభా 54_12 దివి 10.14 |
| | 5 | గు | చ 23.28 ఉ భా 55_24 దివి 18.41 |
| | 6 | శు | ● అమావాశ్య 22.45 రేవ 57.45 దివి 26.36 |
| ఏప్రిల్ నెల | | | ఖరనామ సంవత్సరం. |
| | 7 | శ | శ్రీఖరనామసం చై. శు. పా 25.40 అ 60.10 తెలుగు సంవత్సరాది [రావి 20-44] |
| | 8 | ఆ | వి 28_16 అ 2.3 రావి 20.55 |
| | 9 | సో | త. తది 31_26 భ 6-46 రావి 4.22 |
| | 10 | మం | చ 36.10 కృ 12-3 రావి 25.10 |
| | 11 | బు | పం 40-24 రో 17.58 రావి 2 3 |
| | 12 | గు | ష 44.59 మృ 23.59 రావి 16.9 |
| | 13 | శు | స 49.20 ఆర్ద్ర. త్యాజ్యాభావః |
| | 14 | శ | అ 53.2› పున 35_23 దివి 2.41 |
| | 15 | ఆ | న 56.46 పుష్య 40-20 పునస్త్యాజ్యాభావః పుష్కర యోగం. శ్రీరామనవమి |

Printed and Published by Dr. S. Seshagiri Rao at the Lodhra Press, Kesari Kuteeram Ltd
15, Westcott Road, Royapettah, Madras. Editor: Dr. K. N. Kesari.

